ఇత్తడి తీగ
జపానులో చేయబడినది
కొరకు.
CHIMANLAL VADILAL & Co.,
80, Abdul Rehman St.
Bombay 3.

# ఆంధ్రపత్రిక

మదరాసు రేసులు
1949-50
డిసెంబరు మీటింగు
ఆదివారం 4-12-1949
ఆదివారం 11-12-1949

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 240 SATURDAY 3rd DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# సంక్షుభిత ప్రపంచంలో శాంతిస్థాపనకు గాంధిజీ ప్రబోధమే శరణ్యం

## భాషాప్రయుక్త విభజనవల్ల లెక్కలేనన్ని చిక్కులు రాగలవని రాజాజీ

### కాశ్మీర్ కమిషన్ నివేదిక

#### రెండు వారాలలో తయారు

జెనీవా, డిశంబరు 1: కాశ్మీర్ కమిషన్ సభ్యులు ఒకపక్షంరోజులలోగా తమ నివేదికను ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శికి అందజేస్తారు. అనంతరం భద్రతా మండలి ప్రతినిధులకు ఈ నివేదిక ప్రతులను అందజేసి చర్చకు తేదీ నిర్ణయించుతారు. ఈ కార్యక్రమమంతా వచ్చే సంవత్సరారంభంలోనే జరుగుతుంది.

### షేకు అబ్దుల్లా అమెరికా ప్రయాణం

జమ్మూ, డిశంబరు 1: కాశ్మీరు ప్రధానమంత్రియగు షేకు మహమ్మదు అబ్దుల్లాగారు ఐక్యరాజ్య సమితి సభకు పోవుటకై అమెరికాకు డిసెంబరు 5వ తేదీని బయలుదేరిపోవుచున్నారు.

## ఒరిస్సా ప్రజల సన్మానసభలో గవర్నర్ జనరల్ ప్రసంగం

### కేవలం ప్రచారం నిమిత్తమే భాషారీత్యా ప్రాంతీయ కాంగ్రెస్‌సంఘాలు ఏర్పడినవట

పూరీ, డిశంబరు 1: గవర్నరు జనరలు రాజగోపాలాచారిగారు ఈ వేళ ఇక్కడ మాట్లాడుతూ దేశసేవకులు అస్తమానము తాము చేసిన స్వార్థత్యాగాలను గురించే మాట్లాడుతూ కూర్చుంటే క్రమంగా జనం వీరిని అప్పాల వాళ్ళను చూసినట్లు చూస్తారని అన్నారు.

గవర్నరు జనరల్ తమకు ఇచ్చిన అనేక స్వాగతపత్రాలకు సమాధానంఇస్తూ పైవిధంగా అన్నారు. ఆ స్వాగతపత్రాలలో తమ సేవనుగురించి అత్యధికంగా ప్రసంగిస్తున్న భాగాలనుగురించి, ప్రస్తావించి ఆయన ఇలాగఅన్నారు. "కృతజ్ఞత తెలియజేయడంకోసం అస్తమానం మనం పూర్వంచేసిన స్వార్థత్యాగాలను గురించి ప్రస్తావించనక్కరలేదు. మనం ఇక ఎప్పుడు భవిష్యత్తువిషయమే ఆలోచిస్తూండాలి."

ఆయన ఇంకా ఇలాగ అన్నారు. "భారతదేశానికిప్పుడు ప్రపంచరాజ్యాలలో ఒకసమున్నత స్థానం లభించింది. అయితే మనం ఆ గౌరవానికి తగినట్లుగా ప్రవర్తించాలి. అంతేనే గాని మాటిమాటికి ప్రాచీన మహత్కార్యాలు ఉద్ఘాటించడంవల్ల ప్రయోజనం ఏమీలేదు."

ఆ పిమ్మట గవర్నరుజనరలు నేడు తమ ప్రతిపత్తిని గురించి మాట్లాడుతూ, అది కేవలం స్పీకరు హోదాతో సమానమైనదనీ, పూర్వం గవర్నరుజనరలు సర్వస్వతంత్రుడైన మకుటాధిపతిగా వ్యవహ...

(2వ పేజి చూడుడు)

## శాంతినికేతన మహాసభలో అమృతకౌర్ ఉద్బోధ

### "సత్యాహింసలు అవిభాజ్యాలు"

శాంతినికేతనం, నవంబరు 30: "అహింసాత్మకమైన సమాజనిర్మాణానికి గాంధిజీ పునాదులువేశారు. ఈ దేశంలో ఆయన సాగించిన నిర్మాణాత్మకమైన అన్ని కార్యక్రమాలు అందుకోసం సృష్టిమైనవే," అని నేడు ఇచ్చట ప్రారంభమైన ప్రపంచశాంతివాది మహాసభకు అధ్యక్షత వహించిన శ్రీమతి అమృతకౌర్ స్పష్టంగా ప్రకటించింది.

"ఈ అహింసాత్మక సమాజానికి సత్యం ప్రాణం వంటిది. గాంధిజీ సత్యాన్నే భగవంతుడుగ్రహించారు. సత్యమూ, అహింసా, ఈ రెండు విడదీయడానికి వీల్లేని విషయాలు" అని కూడా ఆమె ఈ సందర్భంలో అన్నది.

మనుష్యుడు సహజంగా శాంతివాది అని అంటూ, ఇప్పుడు ప్రపంచంలో అతడికి సంబంధించిన సమస్యలు ఆయుధసంఘర్షణద్వారా వినా పరిష్కారం కావని భావించడంవల్ల సర్వ విద్రోహామున్నూ బాహిరిల్లుతున్నదని ఆమె హెచ్చరించింది.

(2వ పేజి చూడుడు)

## "కమ్యూనిస్టుచైనానుబ్రిటన్ పరిగణించకూడదు"

### రష్యాపై నైతిక ఆంక్ష అవసరమని రాజకీయ సంఘంలో చైనా ప్రతినిధి వాదన

లేక్‌సక్సెస్, డిసెంబరు 1: ఐక్యరాజ్యసమితికి చైనా ప్రతినిధి అయిన ట్సియాంగ్ ఈ వేళ రాజకీయ సంఘంలో మాట్లాడుతూ, నూరుకోట్ల డాలర్లకోసం ఇంగ్లండు చైనాలోని కమ్యూనిస్టు పరిపాలనను గుర్తించబోదని విశ్వసిస్తున్నామని చెప్పారు.

డాక్టరు ట్సియాంగ్ చైనా వ్యవహారాల్లో రష్యా కలగజేసుకున్న దన్నవిషయంపై మాట్లాడుతూ "పత్రికలలో పడిన వార్తలను బట్టి చూస్తే, ఇంగ్లండు ఏదోవిధంగా చైనా కమ్యూనిస్టులను గుర్తించగలదని తోస్తున్నది." అని అన్నారు.

ఇంగ్లండుకు చైనాలో 100 కోట్ల డాలర్ల పెట్టుబడి ధనం ఉన్నది. ఈడబ్బు తక్కువకాదు. ఈ ధనం సంరక్షించుకోవడానికి వారు చేసే ప్రయత్నాలపై నాకు సానుభూతి ఉన్నది.

అయితే ఈ ధనం ఎంత విస్తారంగా ఉన్నా 45 కోట చైనాప్రజల రాజకీయ స్వాతంత్ర్యంతో సమానంకాదు.

స్వాతంత్ర్యప్రియులైన ఆంగ్లదేశీయులు నూరుకోట్ల డాలర్లకోసం చైనా రాజకీయభవిష్యత్తంతా తుడిచిపెట్టి వెయ్యడం న్యాయంకాదు. కమ్యూనిస్టులను సంతృప్తిపరచడానికి బ్రిటను ఎన్ని విధాలగానైనా ప్రయత్నించవచ్చును; గాని చైనాకమ్యూనిస్టుల చేతులో బ్రిటిషువారి ధనానికి ఎప్పటికైనా అపాయం రాక తప్పదు."

ఆపిమ్మట డాక్టరు ట్సియాంగు ఇంకా మాట్లాడుతూ రష్యా తన సహచర రాజ్యాలతో సహా ఈ చర్చలో పాల్గొనడానికి నిరాకరించిందనీ, దీనినిబట్టి రష్యాకు ఈ విషయంలో చెప్పవలసినదేమీ లేదని తేలుతున్నదనీ అన్నారు.

ఆయన ఇంకా ఇలాగ అన్నారు. "పూర్వకాలపు సామ్రాజ్యతత్త్వమూ, వలసవిధానము నశించిపోయాయి. వాటి స్థానే సామ్రాజ్యతత్త్వంతో కూడిన కమ్యూనిజం అమలులోకి వచ్చింది. ఇది 20వ శతాబ్దం ఉత్తరభాగంలో ప్రపం...

(2వ పేజి చూడుడు)

## ప్రపంచ శాంతి రక్షణ

### సమితి ప్రణాళికకు అందరూ బద్ధులైవుండడం అవసరమని సర్వసభ్యసమావేశ ఆదేశం

#### సోవియెట్ రష్యా ప్రతిపాదన నిరాకరణ

ఫ్లషింగ్ మెడోస్, డిసెంబరు 1: అగ్రరాజ్య పంచకం శాంతి ఒడంబడిక ఒకటి చేసుకోవాలని చెబుతూ రష్యా ప్రతిపాదించిన తీర్మానాన్ని తిరస్కరించి, సమితి సభ్యులందరు ఐక్యరాజ్యసమితి ప్రణాళికలో నిర్వచించిన సూత్రాలకు కట్టుబడి ఉండాలని హెచ్చరిస్తూ బ్రిటన్ అమెరికాలు ప్రవేశపెట్టిన సంయుక్తతీర్మానాన్ని ఒకదానిని జనరల్ అసెంబ్లీ ఈ వేళ ఆమోదించింది.

సమితి సభ్యులందరు ఈ క్రింద జెప్పిన అంశాలను సాధించడానికి సహకరించాలని కూడా బ్రిటన్ అమెరికాల సంయుక్త తీర్మానం విజ్ఞప్తిచేస్తున్నది.

సాధారణ ఆయుధాల ఉత్పత్తి నిల్వలకు సంబంధించి అంతర్జాతీయ నియమ నిబంధనావళి ఒకటి తయారు అయ్యేట్లు చూడాలి; అణుశక్తి నిర్మాణాత్మక కార్యక్రమాలకే వినియోగ పడునట్లుగా నిగ్రహించాలి; భద్రతా మండలిలో శాశ్వత సభ్యులైన బ్రిటన్, అమెరికా, రష్యా, ఫ్రాన్సు, చైనాలు వీటో అధికారాన్ని వినియోగించడంలో కొంత నిగ్రహం చూపాలి. 59 దేశాలు సభ్యులుగా ఉన్న జనరల్ అసెంబ్లీ ఈ సంయుక్త తీర్మానాన్ని 53 ఓట్లతో ఆమోదించింది.

చివరిసారి వోటింగు జరిపినప్పుడు రష్యా, బైలో రష్యా, యుక్రైన్, పోలెండు, జెకోస్లోవాకియాలు మాత్రమే తీర్మానాన్ని ప్రతిఘటించినవి; యుగోస్లావియా తటస్థంగా ఉన్నది.

తీర్మానంలోని ఒక్కొక్క పేరా

(2వ పేజీ చూడుడు)

## అట్లాంటిక్ రాజ్యాల సమష్టిరక్షణ పథకం

### విదేశాంగమంత్రుల ఏకగ్రీవామోదం

పారిస్, డిశంబరు 1: పండ్రెండు ఉత్తర అట్లాంటిక్ రాజ్యాల రక్షణశాఖా మంత్రులు పారిస్‌లో ఈవేళ సమావేశమై 5 గంటలసేపు సంప్రతింపులు జరిపిన మీదట, ఐక్యకంఠంగా తాము వివిధ విషయములమీద ఒడంబడికకు వచ్చినట్లు ప్రకటించిరి.

1. ఉత్తర అట్లాంటిక్ రాజ్యాలను పన్నెండింటిని ఏవిధంగా అనుసంధించి సమిష్టి రక్షణ పథకంలో ఇముడ్చాలి?

2. ఆయుధములను సైనిక సామగ్రిని ఏ కార్యక్రమ ప్రకారంగా ఉత్పత్తిచేసి సరఫరా చేయాలి?

3. వివిధ ప్రాంతీయ కూటములలోను ప్లానింగ్‌ను ఏవిధంగా సమన్వయపరచాలి.

4. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికకింద రక్షణ సన్నాహాల పురోగమనం, ఈ నాలుగు విషయములమీద రక్షణశాఖా మంత్రులు సంపూర్ణ సమాధానానికి వచ్చినారనిచెబుతూ, నేటిరాత్రి సమావేశానంతరం ఒక ప్రకటన చేయబడెను.

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికలో 3వ క్లాజులో నిర్వచించబడిన స్వయంసహాయ పరస్పర సహకార సూత్రములను అనుసరించి ...

### భారతరిపబ్లిక్‌పరిగణన బిల్లు

#### సోమవారం కామన్సులో రెండవ ప్రతిపాదన

### ముఖ్య రహస్యాల విషయంలో ఫ్రాన్సుపైపశ్చిమరాజ్యాలఅపనమ్మకం

#### "న్యూస్ వీక్" పత్రిక ప్రకటన

## స్టర్లింగ్ నిల్వల తగ్గింపుకు టోరీవర్గాల ప్రయత్నం

లండన్, డిసెంబర్ 1: యుద్ధకాలంలో సప్లయిచేసిన వస్తువులకు, అనేక విధాలుగా చేసిన సహాయానికి ప్రతిఫలంగా ఆయా దేశాలకు యివ్వవలసిన స్టర్లింగ్ బాకీ మొత్తాలను తగ్గించాలని పార్లమెంటులోని యిద్దరు టోరీ సభ్యులు బ్రిటిష్ ప్రభుత్వాన్ని అడుగ నిశ్చయించారు.

వీరు కర్నల్ క్రాస్థవైటీఐగ్, వాల్టర్ ప్లిచ్చరి. ప్రభుత్వం తన బాధ్యతలను నిర్వర్తించాలని కోరుతూ, కామన్సుసభలో ఒక ప్రతిపాదన చేశారు. ఈ ప్రతిపాదనపై చర్చ జరుగకపోవచ్చు.

స్టర్లింగ్ బాకీలు రావలసిన దేశాలు తమ బాకీలను, రాబట్టుకోవడం ప్రస్తుతం మానేటట్లుగాని లేదా, బ్రిటిష్ ప్రభుత్వం వీరాను ప్రతిపాదనలను అవి అంగీకరించేటట్లుగాని చేయుటకు ప్రభుత్వం యత్నించేనండి, అని క్రాస్థవైట్ ఐర్ మంగళవారంనాడు పార్లమెంటులో ...

### త్వరలో యునాన్ రాష్ట్ర పతనం

హాంగ్‌కాంగ్, డిసెంబరు 1: యునాన్ రాష్ట్రంలో జాతీయవాదుల ప్రాబల్యం అణగారిపోయి కమ్యూనిస్టులదే పైచెయ్యి అవుతున్నదనీ, క్రమంగా ప్రతిఘటన లేకుండానే రాష్ట్రం కమ్యూనిస్టుల వశం కాగలదనీ, యునాన్ రాజధాని కుమింగ్‌నుండి వచ్చిన ప్రయాణీకులు చెబుతున్నారు.

## డిసెంబరు 27న ఐక్య ఇండొనీషియా అవతరణ

బటేవియా, డిసెంబరు 1: ఇండొనీషియాకు స్వాతంత్ర్యప్రదానం డిసెంబరు 27-న జరగవచ్చునని, చెబుతూ రిపబ్లికన్ ప్రభుత్వం జోగ్జకర్తాలో నేటిరాత్రి ఒక ప్రకటన చేసింది. డచ్చి విదేశాంగమంత్రి డా॥ డర్క్ స్టిక్కర్, ఉపప్రధాని వాన్ మైస్ ఇండొనీషియాకు వచ్చి ప్రభుత్వంతో జరిపిన చర్చల విషయమై ప్రకటన ఈవిధంగా తెలియజేస్తున్నది. అధ్యక్షుడు సొకర్నోతోను రక్షణశాఖా మంత్రి జోగ్జకర్తా సుల్తానుతోను ఇండొనీషియా హాలెండుల భవిష్యత్ సహకారం విషయమై వీరు చర్చలు జరిపిరి.

ఇండొనీషియా పునర్నిర్మాణానికి ఈ పరస్పర సహకారం ఏ కారణాలచేత అగ...

(2వ పేజీ చూడుడు)

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు॥ త్రయో॥ 1949 సం॥ డిసెంబరు 3 శనివారం త్రయోదశి సా 5-8 కర రా10-45 వర్జ్యం ఉ 6-41 ల 8-25 కు.

శు॥ చతుర్దశి డిసెం॥ 4 ఆదివారం ఆ॥ చతుర్దశి సా 7-8 కృ రా 1-9 వర్జ్యం ప 11-57 ల 1-43 కు.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర శు॥ త్రయో॥

శనివారం

# ప్రపంచశాంతి సభ

ప్రపంచశాంతిని సాధించి, సంరక్షించుటకు ఏర్పడిన ఐక్యరాజ్య సమితి ఈనాటివరకు ద్వితీయ సంగ్రామ ఫలితముగ ఉత్పన్నమైన సమస్యలనే పూర్తిగ పరిష్కరింపలేకున్నది. యుద్ధకారణములను నిర్మూలించుటకు సమితి జరిపిన ప్రయత్నములన్నియు విఫలమైనవి. అయినను సమితి సమావేశములందు శాంతి గీతాలాపన తరుచు వినవచ్చుచున్నది, పథకముల ప్రతిపాదనలద్వారా, సమితి తీర్మానములద్వారా ప్రపంచ శాంతి ని సాధింపవలెనని ప్రపంచ రాజ్యములు నిరంతరము ప్రయత్నము చేయుచున్నవి. కాని ప్రతి ప్రభుత్వము తన దేశమును "రాబోవు సంగ్రామమునకు సన్నద్ధపరచుచు" సమితి సమావేశములందు 'శాంతి' ప్రసంగములను చేయుచు, తీర్మానములను ఆమోదించుచుఉన్నందువలన ఎట్టి ప్రయోజనము ఉండదు. తన అమెరికా పర్యటనలో భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఈ విషయమునే అనేక సందర్భములందు ఉద్ఘాటించెను. పరిమితి లేక ఆయుధబలమును వృద్ధిచేసుకొనుట ద్వారా ఏ దేశము శాంతికి శోపానము వేయజాలదని స్పష్టముచేసిరి.

యుద్ధసన్నాహములు జరుగుచున్నంతవరకు ఏ దేశము సంగ్రామ హేతువులైన దారిద్ర్యము, దుర్భిక్షములను నిర్మూలింపజాలదు. ప్రజల జీవన ప్రమాణమును వృద్ధిచేసి ప్రపంచమున 'లేమి'కి స్థానములేకుండ చేయుట సాధ్యము కాదు. మరొక యుద్ధమురాదు అను నమ్మకము ప్రభుత్వములకు, ప్రజలకు కలిగిన గాని తమశక్తి, సంపదలను నిర్మాణాత్మక కార్యక్రమముల నిర్వహణకు వినియోగించుట సాధ్యముగాదు. కనుక ఐక్యరాజ్యసమితిగాని, శాంతిస్థాపన లక్ష్యముగ గల ఏ ఇతరసంస్థగాని యుద్ధనిర్వహణ సాధనల నిషేధమునకుగాక, యుద్ధమును నిషేధించుటకే ప్రయత్నింపవలసి యుండును. ప్రస్తుతము శాంతినికేతనములో జరుగుచున్న ప్రపంచ శాంతి సభ ఇందు నిమిత్తము చేయు కృషి ఫలింపగలదని ఆశింపవచ్చును.

ఈ సమావేశమును ప్రారంభించుచు పశ్చిమ బెంగాలు గవర్నరు డా॥ కైలాసనాథ్ కట్జూ ఒక ప్రధానమైన సూచనను చేసియుండిరి. బ్రిటన్ తన సామ్రాజ్యమును పరిత్యజించి తన చిత్తశుద్ధిని, శాంతి ప్రియత్వమును చాటుకొనియున్నందున ఇతర రాజ్యములకు మార్గదర్శకముగ నుండునట్లు పూర్తిగ ఆయుధ విసర్జనముచేసి, నిఖిల సమస్యల పరిష్కారమునకు సాత్విక మార్గమును అవలంబించవలెను ని. బ్రిటన్‌గాని,క్షేఅమెరికాగాని,రష్యాగాని ప్రపంచ శాంతి సాధనకు ఇట్టి మహత్తరమైన త్యాగము చేసిన అపారమగు నైతికబలమును పొంది, ఎంతటి సైనికబలమునైనను ప్రతిఘటింపగల శక్తిని సంపాదించుకొనగలదు. కాని ఏ ప్రభుత్వము ఐచ్ఛికముగ ఇట్టిచర్యకు పూనుకొనజాలదు. అన్ని దేశములందును ప్రజాభిప్రాయమును సంఘటితపరచి ప్రభుత్వములు యుద్ధమార్గములను విసర్జించి శాంతిమార్గమును అనుసరించునట్లు చేయగలశక్తి, చేయవలసిన బాధ్యత అనధికారసంస్థలకే హెచ్చుగగలదు. శాంతినికేతనమునందు జరుగుచున్న సభ ఈ విషయమును గుర్తించి, అఖిల ప్రపంచము, గాంధి మహాత్ముడు చూపిన మార్గమునే అనుసరించునట్లు చేయుటకు, తీవ్రమైన కృషి చేయవలసియుండును. ఈ శాంతి సభ భారత దేశమునందు, అందును శాంతి నికేతనమునందు జరుగుట ఉచితముగ నున్నది. ఇట్టి సమావేశములు తరుచు జరుగుచుండిన ప్రజల దృష్టి యుద్ధమునుండి శాంతిపై మరలుటే గాక, క్రమముగ 'యుద్ధభీతి' కూడ తొలగిపోగలదు. 'భీతి' నిర్మూలనమే మహోత్కృష్ట కార్యక్రమములో ప్రధానాంశము. అది సాధ్యమైన ప్రపంచ శాంతి స్థాపన జరిగినట్లే.

## ఇక జరుగవలసిన పని

ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జనవరి 26 లోపున కాని, ఆ నాటికి గాని పూర్తికాగలదను ఆశలు భారత ప్రభుత్వ హోం శాఖా కార్యదర్శి లేఖవలన పటాపంచలైనవి. "ఆంధ్రరాష్ట్రము ఎప్పుడు? ఏ విధముగ? ఏర్పడును" అను ప్రశ్నలు తిరిగి ప్రత్యక్షమైనవి. ఆంధ్ర నాయకులు, ఆంధ్ర మంత్రులు విశేష శ్రద్ధవహించి జనవరి 26 లోపున ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ ఉత్తరువు జారీ అగునట్లు చూడకున్న నూత్న రాజ్యాంగమును అనుసరించి ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము ఎప్పటికి ఏర్పడునో చెప్పుట సాధ్యముగాదు. నాయకత్రయ నివేదిక ననుసరించి ఇపుడు- అనగా స్వతంత్ర భారత రిపబ్లిక్ రాజ్యాంగము అమలు జరుగుటతో- ఏర్పడకున్న ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఏర్పడుటకు ఎన్ని దశాబ్దములు పట్టునో ఎవ్వరు చెప్పజాలరని డాక్టర్ పట్టాభిసీతారామయ్యగారే హెచ్చరించియుండిరి. కనుక 1935 వ సంవత్సరపు భారత ప్రభుత్వచట్టము నందలి 290 సెక్షను ప్రకారమె ఆంధ్ర రాష్ట్రనిర్మాణము జరుగుట అత్యంతావశ్యకము.

ఆంధ్రులు ఇది సఫలమగుటకు చేయవలసిన పనులను గురించి విచారించుటకు బదులు రాజధాని ఎక్కడ, హైకోర్టు ఎక్కడ, మున్నగు సమస్యలపై వాదప్రతివాదములను జరుపుచుండుట శోచనీయము. కొన్ని సంఘములు అపుడె తీర్మానములు చేయ నారంభించినవి. ఆంధ్రులు ఇట్టివాద ప్రతివాదముల బడి రాష్ట్రనిర్మాణ సమస్యను విస్మరింపవలెననియో భారత ప్రభుత్వ హోంశాఖాకార్యదర్శి రాజధాని, హైకోర్టు మున్నగు విషయములు తత్క్షణము పరిష్కారము కావలెనని సూచించెను. కనుక మన మిప్పుడు రాజధాని ఎచట, హైకోర్టు ఎక్కడ? శ్రీబాగు ఒడంబడిక ఏమైనది? మనకు ఎవరు ప్రధానమంత్రి? మన రాష్ట్రమునకు గవర్నరు ఎవరు? అను విషయములపై చర్చలు జరుపుట, సభలుచేసి తీర్మానములు చేయుటలో యావచ్ఛక్తిని దుర్వినియోగము చేయుటకంటె 1950 జనవరి 26 వకు పూర్వము గవర్నరు జనరలు ఉత్తరువు జారీ అగుటకు తీసుకొనవలసిన చర్యలేమి అను విషయమును ఎక్కువగ ఆలోచింపవలసియుండును. గవర్నరు జనరలు ఉత్తరువునందు ఆంధ్ర రాష్ట్ర అవతరణ తేదీ అందరికి వీలుగ నుండునట్లు నిర్ణయము కావచ్చును. 1950 ఏప్రిల్ 1 కి ఆంధ్రరాష్ట్ర మేర్పడుట ప్రయోజనకరమైన గవర్నరు జనరల్ ఉత్తరువునందె స్పష్టముచేయవచ్చును.

కాని గవర్నరు జనరలు ఉత్తరువు మాత్రము జనవరి 26 లోపున జారీకావలెను. అదిఎట్లుసాధ్యమో ఆంధ్రనాయకులు విచారించి అందుకు తగినచర్యలు తీసుకొనవలసియుండును.

## భాషా రాష్ట్రాలు: రాజాజీ విమర్శ

(1 వ పేజీ తరువాయి)

దేశాన్ని మత ప్రకారం విభజించడం వల్ల అనేకమైన ఇబ్బందులు వచ్చాయి. ఇక భాషా ప్రయుక్తంగా రాష్ట్రవిభజన ప్రారంభిస్తే అంతకంటె ఎక్కువ ఇబ్బందులు వస్తాయి చాలాకాలం, కిందట కేవలం ప్రచారంకోసం దేశాన్ని భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా విభజించుకున్నాము. అయితే ప్రచారం సంగతి వేరు; పరిపాలన సంగతి వేరు. అయితే మీరు ప్రస్తుతం చెప్పిన విషయంలో న్యాయప్రకారం ఎంతవరకు వీలయితే అంతవరకు చేస్తాను. కేంద్రంలో ఉన్నవారు అత్యధికంగా ప్రజాస్వామ్య దృక్పథం కలవారు. వారి విషయాలన్నీ చాలా జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు. అయితే లేనిపోని అనవసరమయిన కోరికలతో పండిత నెహ్రూను ఆయన అనుచరులను కలతపెట్టవద్దని కోరుతున్నాను."

ఆపైన రాజాజీ ఒరిస్సాలో రాకపోకల సౌకర్యాలు చాలా ఎక్కువగా కలిగించ వలసిన అవసరం ఉన్నదనీ, ఈ విషయం కేంద్రంకూడా ఆలోచిస్తూనే ఉన్నదనీ, ఒరిస్సా గవర్నరుకు కేంద్రంతో బాగా సన్నిహితత్వం వున్నదనీ, పూరీ చాలా సొగసైన ప్రదేశమనీ, యీ నగరానికి నీటిసరఫరా ఏర్పాటు చాలా అవసరమనీ, ఇంకా మురుగునీటి పారుదలకుకూడా గట్టి ఏర్పాట్లు చెయ్యాలనీ అన్నారు.

గవర్నరు జనరలు తమ ఉపన్యాసం, ముగిస్తూ ఇలాగ అన్నారు. "మీరు మీ స్వాగత పత్రంలో స్వధర్మం విషయంలో ఎక్కువగా గర్వపడుతున్నామని అన్నారు. దానికి నేను చాలా ఆనందిస్తున్నాను. మన ధర్మప్రకారమే మనం జీవించ గలిగితే ఇంక అంతకన్న కావలసినది ఏమీలేదు. ఇలాగచేస్తే తప్పకుండా మనదేశం మహోన్నత స్థానం ఆక్రమిస్తుంది. జగన్నాథుడు మిమ్మల్నీ భారతప్రజలను ఆశీర్వదించుగాక!"

గవర్నరు జనరలు స్వాగత పత్రాలకు సమాధానం చెబుతూ తమ ప్రసంగం ప్రారంభంలో ఇలాగ అన్నారు." మీరందరు ఈ సమావేశంలో అత్యద్భుతమైన క్రమశిక్షణ, నియమము ప్రదర్శించారు. దీనికి మీకు నా కృతజ్ఞత. దీనివల్ల మున్ముందు కూడా మనలో ఈ క్రమశిక్షణ అభివృద్ధిచె దగలదని ఆశిస్తున్నాను. మీరు భారాధిపతినైన నాకు చేసిన గౌరవం భారత మాతకే చెందుతుంది. మనదేశంలో నియమములు, క్రమశిక్షణ ఉండడంవల్లనే ప్రపంచంలో అంతటా మనకు గౌరవం కలిగింది."

పూరీలో అనేక సంఘాలవారు రాజాజీకి స్వాగత పత్రాలు సమర్పించారు. ఒరిస్సా అసెంబ్లీ స్పీకరు పట్నాయక్ రాజాజీని ఉద్దేశించిన స్వాగతపత్రం చదివారు.

ఒరిస్సా ప్రధాని రాజాజీ ప్రసంగం ఒరియాలో అనువదించి చెప్పి, ఒరిస్సా ప్రజల తరఫున రాజాజీ కృతజ్ఞత తెలియజేశారు. నిన్న కటక్‌లో ఒక సమావేశంలో ప్రసంగిస్తూ, రాజాజీ ఈరోజుల్లో ప్రపంచమంతా వీకమై పోయిందనీ ఎక్కడో అనేకచోట్ల ఏర్పడిన పరిస్థితులవల్ల భారతదేశంలో పరిణామాలు ఏర్పడుతున్నాయనీ, మనదేశంలో గొప్ప గొప్ప నాయకులు రాజ్యాంగచక్రం నడిపిస్తుండడంవల్ల మనకు శాంతి సౌభాగ్యాలు ఏర్పడ్డాయనీ, ప్రజలు సరియైన వ్యక్తులను రాజ్యాధికారులుగా ఎన్నుకోవాలనీ, అలాగ ఎన్నుకోబడిన నాయకులు ప్రజల క్షేమంకోసం ప్రవర్తించాలనీ చెప్పారు.

# హైదరాబాదు సంస్థానంలో సివిల్ ప్రభుత్వ స్థాపన

## ప్రధానమంత్రిగా వెల్లోడీ ప్రమాణ స్వీకారం

### బొలారం రెసిడెన్సీ భవనంపై భారత జాతీయ పతాక ప్రతిష్ఠాపన

హైదరాబాద్, డిసెంబరు 1: 14 నెలలనుండి హైదరాబాద్ పరిపాలన నిర్వహిస్తున్న మిలిటరీప్రభుత్వం పరిసమాప్తమై దానిస్థానే నేటి మధ్యాహ్నం ఎం. కె. వెల్లోడీగారు ప్రధానమంత్రిగా సివిల్ ప్రభుత్వము ఏర్పడింది. మిలిటరీగవర్నరు చౌధరిగారినుండి వెల్లోడీ గారు చార్జీ పుచ్చుకొన్నారు. మిలిటరీగవర్నరు అధికారము స్వీకరించిన రోజున బొలారం రెసిడెన్సీ భవనంపై ఎగురవేయబడి యిప్పటివరకు యున్న దక్షిణభారత సైనికపతాకం స్థానే భారత జాతీయ పతాక ప్రతిష్ఠింపబడింది.

సాయంకాలం సరిగా 4 గం. లకు మిలిటరీగవర్నరు పదవినుండి విరమించి వెళ్లిపోతున్న మేజర్‌జనరల్ చౌధరిగారు, ప్రధానమంత్రిగా నియమించబడిన ఎం. కె. వెల్లోడీగారు పతాక స్తంభముగద్దకు వచ్చారు. చౌధరిగారు సైనిక యూనిఫారంలో వున్నారు. వెల్లోడీగారు తెల్లట్రవుజరు, నల్లని షేర్వానీ వేసుకొన్నారు. ఇరువురుకూడ భారతసైన్య 4 వ పదాతిదళం సమర్పించిన సైనిక వందనమును స్వీకరించారు అనంతరం దక్షిణ భారతసైనిక పతాకం కిందికి దించబడి చౌధరిగారికి యివ్వబడింది. దక్షిణ భారతసైన్యం తరఫున బ్రిగేడీర్ సింహసింగ్ పతాకాన్ని స్వీకరించారు. తర్వాత బాండువాద్యంపై 'జనగణమన' ఆలాపింప బడుచుండగా భారత జాతీయపతాక ప్రతిష్ఠింపబడింది.

తర్వాత ప్రధాన న్యాయమూర్తి రామచంద్రనాయక్‌గారు వెల్లోడీ గారి చేత ప్రమాణస్వీకారం చేయించారు. ప్రమాణ పాఠం. "ముల్లాత్‌కడింగి వెల్లోడీ నైన నేను, భారత రాజ్యాంగంపట్ల సంపూర్ణ విశ్వాసంతో ఉంటూ ప్రధానమంత్రిగా నా కున్న బాధ్యతలను హృదయపూర్వకంగా నెరవేర్చగలనని ప్రమాణం చేయుచున్నాను. పక్షపాత రహితంగా ప్రజలందరిపట్ల సమానాదరంతో ప్రవర్తించగలను. నాపరిశీలనకిందకు తీసుకొనిరాబడు ఏవిషయాన్నైనా ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని, నావిధినిర్వహణలో అవసరమైనప్పుడు తప్ప యితరులకు తెలియజేయ్యను."

తర్వాత వెల్లోడీగారు హోంశాఖామంత్రి డి.ఎస్. శాస్త్రి, ఆర్థికమంత్రి సి.వి. రావు, పబ్లిక్‌వర్క్స్ మంత్రి నవాబ్ జైన్‌యార్‌జంగ్ బహదూర్, విద్యామంత్రి. రాజాధోండేరాజ్ బహదూర్, గార్లచే యిదేవిధంగా ప్రమాణస్వీకారం చేయించారు. రెవెన్యూమంత్రి ఎం. శేషాద్రిగారు ప్రస్తుతం హైదరాబాద్‌లో లేకపోవుటచే నేడు ప్రమాణస్వీకారం చెయ్యలేదు.

ఎం. కె. వెల్లోడీగారు నేటిమధ్యాహ్నం 12 గం 30 ని॥లకు ఢిల్లీనుండి ఒక ప్రత్యేకవిమానంలో హైదరాబాద్ వచ్చారు. విమానాశ్రయంవద్ద ఆయనకు మేజర్ జనరల్ చౌధరీ డి. ఎస్. శాస్త్రిగారు స్వాగతమిచ్చారు. వచ్చిన వెంటనే వెల్లోడీగారు బొలారం రెసిడెన్సీ భవనం వెళ్ళారు.

మధ్యాహ్నం మేజర్‌జనరల్ చౌధరీ ఎం. కె. వెల్లోడీగారు నిజాంనవాబును ఆయన భవనంలో కలుసుకొన్నారు.

## వెల్లోడీ జీవితవివరాలు

ముల్లాత్‌కడింగి వెల్లోడీగారు శ్రీ॥ శే॥ కాలికట్ జమోరిన్ పుత్రుడు. 1896 జనవరి 14న జనించెను. 1921 లో ఇండియా సివిల్‌సర్వీసులో చేరెను. ఆ తర్వాత ఆయన మద్రాసుప్రభుత్వంలో 15 సంవత్సరాలు పని చేసెను. 1937 నుండి రెండు సంవత్సరాలపాటు ఒరిస్సాప్రభుత్వ కార్యదర్శిగా పనిచేసెను. 1940 లో అతను భారతప్రభుత్వ ధరల సలహాదారుగా కేంద్రప్రభుత్వంలో చేరెను. 1942 నుండి 46 వరకు బొంబాయి ఎగుమతి వ్యాపార కంట్రోలు ఉద్యోగిగా పనిచేసెను. 1946 లో బొంబాయి టెక్స్టైలు కమిషనరుగా పనిచేసెను.

1945 నవంబరులో డెప్యూటీ హైకమిషనరుగా లండన్ వెళ్లి ఇండియా ఆఫీసును పునర్వ్యవస్థీకరించుటలో సహాయపడెను. రెండు సంవత్సరముల తర్వాత హై కమిషనరయ్యెను. 1947 లో ఐక్యరాజ్య సమితి భారత ప్రతినిధివర్గ ప్రధాన కార్యదర్శిగా సమితికి పోయి అక్కడ గోపాలస్వామి అయ్యంగారితో కలిసి భద్రతా మండలికి వెళ్లారు అక్కడ నుండి తిరిగి వచ్చిన తర్వాత ప్రభుత్వ విదేశాంగ శాఖలో స్పెషలాఫీసరుగా చేరారు. 1948 అక్టోబరు సంస్థాన శాఖ కార్యదర్శిగా నియమింపబడినారు. అంతవరకు ఆ పదవిలో నున్న వి. పి. మీనన్ గారు సంస్థాన శాఖ రాజకీయ సలహాదారుగా నియమించబడినారు. సంస్థాన శాఖ కార్యదర్శిగా, సంస్థానాల విలీనీకరణ కార్యక్రమంలో తన పాత్రను నిర్వహించారు. భారత ప్రభుత్వంలోని సమర్థులైన పురుషులలో వెల్లోడి గారు ఒకరు. వాస్య చతురుడు. సత్శీలుడు.

## నిజాం ఫర్మానాపై వివిధ వర్గాల అభిప్రాయం

ఎం. కె. వెల్లోడి గారిని తన 'ప్రధానమంత్రిగా' నియమిస్తూ నిజాం నవాబు నిన్న జారీచేసిన ఫర్మానా ఇక్కడి రాజకీయ వర్గాలను కొంచెం ఆశ్చర్య పరచింది. హైదరాబాద్ సంస్థానకాంగ్రెసువాదులు ఫర్మానా మీద యింతవరకు ఏవిధమైన వ్యాఖ్యానం చెయ్యనప్పటికీ, అతివాద వర్గాలు యిటువంటి పరిణామం వస్తుందని ఊహించలేదు. సర్దార్ వల్లభాయ్ పటేల్ వంటి రాజనీతి నిపుణుని న్యాయకత్వాన సంస్థాన శాఖ హైదరాబాద్ విషయంలో యింతవరకు కూడ తన కార్యక్రమం ప్రకారం పని చేసిందని సంస్థానంలో అది యీ రాజకీయ పార్టీకి ఆ రాజకీయ పార్టీకి అనుకూలంగా ఉంటుందా ఉండదా అని ఆలోచించకుండా తన కార్యక్రమం ప్రకారం పనిచేసిందని ఏ పక్షానికీ చెందని వారంటున్నారు.

హైదరాబాద్‌లో శాంతి భద్రతలను పునరుద్ధరించుటకు గాను ఇండియా ప్రభుత్వం హైదరాబాద్‌పై పోలీసుచర్య తీసుకోవలసివచ్చిందని ఇండియా గవర్నరు జనరల్ స్పష్టం చేసియుండెను. ఇందు కొరకే మిలిటరీప్రభుత్వం కూడ ఏర్పాటు చెయ్యబడింది. ఈ కార్యక్రమం పూర్తి కాగానే ఆప్రభుత్వం రద్దు చెయ్యబడింది. దీనితోపాటు హైదరాబాద్ భారత సమాఖ్యలో ప్రవేశించటంకూడ జరిగింది. ప్రస్తుతం నిజాంనవాబు ప్రతిపత్తి భారత సమాఖ్యలో చేరిన యితర సంస్థానాధీశులతో సమానంగా ఉంది. హైదరాబాద్ భారత సమాఖ్యలో చేరినప్పటికీ ఏవాయిధవిషయాస్తు మొదలగు అతిముఖ్యమైన సమస్యలపై తీర్పుయిచ్చే హక్కు ప్రజలనుండి తొలగించలేరు. హైదరాబాద్ రాజ్యాంగపరిషత్తు చేయు నిర్ణయాలు భారతప్రభుత్వానికి సిఫార్సులు మాత్రమే అయినప్పటికీ పై సమస్యలను పరిష్కరించవలసివచ్చిన అదను వచ్చినప్పుడు, భారత ప్రభుత్వం వాస్తవిక దృక్పథంలో వాటిని పరిష్కరించగలదని భావించవచ్చును.

మంజూర్ అహమ్మద్ ఖాన్‌గారు ఒక ఇంటర్వ్యూలో యిట్లాఅన్నారు. "వెల్లోడీగారిని ప్రధానమంత్రిగా నియమిస్తూ నిజాంనవాబు జారీచేసినఫర్మానా చూశాను. నిజాంనవాబు తన కివ్వబడుతున్న గౌరవానికి భారతప్రభుత్వమునకు ముఖ్యంగా సర్దార్ పటేల్‌గారికి కృతజ్ఞులై ఉండవలెను. ప్రస్తుతం హైదరాబాద్ భారత సమాఖ్యలో చేరింది. అందుచే నిజాంనవాబును సమాఖ్యలో చేరిన యితర సంస్థానాధీశులతో సమానంగా చూడటానికి సంస్థానశాఖ నిర్ణయించింది. ఇంతకంటే నిజాంనవాబు యితరంగా ఎక్కువగా గౌరవం పొందగలడా?"

## బ్రిటన్ అధిక్షేపణ

లండన్, డిసెంబరు 1: అమెరికన్ కౌన్సిల్ ఆంగస్ వార్డు పర్యంతాన్ని పురస్కరించుకొని కమ్యూనిస్టు అధికారులకు అధిక్షేపణ తెలియజేసి. లండనుగా, బ్రిటిష్ ప్రభుత్వం ముక్డెన్‌లోని తమ కౌన్సిల్ జనరల్ ఎడ్వర్డ్ బి. గ్రహాంను ఆహ్వానించింది. కమ్యూనిస్టు విదేశాంగ కార్యాలయ ప్రతినిధి ఒకరు నేడిరాత్రి ప్రకటించారు.

## ఐక్య ఇండొనీషియా అవతరణ

(1 వ పేజీ తరువాయి)

డ్యామెర్ ఏకరిస్తూ అధ్యక్షుడు సోకర్నో త్వరలో నే ఒక రేడియో ప్రసంగం చేయగలడు.

"హేగ్ రౌండు టేబుల్ సమావేశంలో కనిపించిన పరస్పర సహకారపద్ధతులు ఇండొనీషియాలోకూడా ఇప్పుడు కనిపిస్తున్నవి. వాన్‌మైక్ స్టిక్కర్ల ఆగమనం ఈ సహకారభావానికి అన్యోన్య తపదోహదం చేయగలదు.

(ఇండొనీషియా తరఫున అధికారం స్వీకరించడానికి నియమించబడిన) జాతీయ సంఘానికి అధ్యక్షుడైన మహమ్మద్ రోయిమ్‌ను వెంటబెట్టుకొని స్టిక్కర్ వాన్ మైక్‌లు ఈ వేళ బటేవియాకు తిరిగివచ్చిరి.

## ఇండొనీషియా సమస్యపై లేక్‌సక్సెస్‌లోని ఆసియా ప్రతినిధుల సమావేశం

లేక్‌సక్సెస్, డిసెంబరు 1: ఐక్యరాజ్య సమితిలోని 13 ఆసియా దేశాల ప్రతినిధులూ ఆస్ట్రేలియా ప్రతినిధులూ నేటి రాత్రి లేక్‌సక్సెస్‌లో సమావేశమై, ఇండొనీషియా విషయం, జనరల్ అసెంబ్లీలో చర్చకు వచ్చినప్పుడు తాము అవలంబించవలసిన విధానం ఏమిటో సమిష్టిగా నిర్ణయించుకో బోతున్నారు. ఇండొనీషియా సమస్య, జనరల్ అసెంబ్లీలో త్వరలోనే చర్చకు రానున్నది. ఈ సమావేశం ఇండియా ఆస్ట్రేలియాల ఆధ్వర్యమున జరుగుతున్నది.

## కమ్యూనిస్టు చైనా పరిగణన సమస్య

(1-వ పేజీ తరువాయి)

చింది. ఈ సవరణ మీరందరు అంగీకరించాలని కోరుతున్నాను. లేకపోతే ఇన్ని దేశాలుకలిసి ప్రతిపాదించిన తీర్మానం కేవలం అసంబద్ధంగా కనబడుతుంది. అందుచేత చైనా ప్రతిపాదించిన సవరణతో పై తీర్మానాన్ని అంగీకరించ వలసిందని కోరుతున్నాను."

ఆ పిమ్మట హైతి, పెరు, మొదలైన దేశాల ప్రతినిధులు చైనా ప్రస్తుత పరిస్థితులపై తమ సానుభూతి తెలియజేస్తూ మాట్లాడారు. ఆ పిమ్మట ఈ చర్చ రేపటికి వాయిదాపడింది.

## కమ్యూనిస్టు చైనా పరిగణన సమస్య

### వివిధదేశాల వైఖరి

న్యూఢిల్లీ, డిసెంబరు 1: చైనా జాతీయ ప్రభుత్వాన్ని ఒక చోటినుంచి ఒక చోటికి తరిమివేయడంలో జయంపొందిన కమ్యూనిస్టులు, తాము నెలకొల్పిన ప్రభుత్వానికి వివిధదేశాల పరిగణను సంపాదించడంలో కృతకృత్యులు కాగలరా? అన్న విషయము యింకా సంశయాస్పదంగానే వున్నది.

యు. పి. విలేఖరి ఢిల్లీ అధికార వర్గాలలో విచారించి యీదిగువ విషయాన్ని తెలియజేశాడు.

కమ్యూనిస్టుచైనా పరిగణన విషయమై భారత ప్రభుత్వ తుదినిర్ణయం ఎప్పుడు జరిగేదీ యిదమిత్థంగా తేలలేదు. ప్రభుత్వం యింకా యీవిషయాన్ని పరిశీలిస్తున్నట్లు అధికారవర్గాలలో విచారించగా తెలియవచ్చింది. మిగతా దేశాల వైఖరులను గురించి ఇక్కడ రాయబారవర్గాలలో విచారించగా, అమెరికాకంటే ముందు బ్రిటన్ కమ్యూనిస్టు చైనాను పరిగణిస్తుందని, యిలా పరిగణించడంలో ఉద్దేశ్యం చైనాలోని తన పెట్టుబడులను వాణిజ్యాన్ని కాపాడుకోవడమే నని తెలియవచ్చింది. హోచిమిన్హ్ ఆగ్నేయంలో వున్న ఇండోచైనా కమ్యూనిస్టు చైనాను అనుకొని ఉండటంచేత ఫ్రాన్సు విషయం కొంచెంక్లిష్టంగా ఉన్నది నిజం మాట్లాడాలంటే ఇండోచైనాలో ఫ్రెంచి అధికారులస్థితి ముందు నుయ్యి వెనుక గోయిలా వున్నది. కమ్యూనిస్టు చైనాను ఫ్రాన్సు వెంటనే పరిగణించిందంటే ఇండోచైనాలో హోచిమిన్‌హ్ స్థితి బాగా బలపడటం జరుగుతుంది. అలా చేయకపోతే, కమ్యూనిస్టు అనుకూలవిద్రోహశక్తులు యిప్పటికంటే తీవ్రతరంగా విజృంభిస్తాయి.

## టిబెట్‌కు చైనా కమ్యూనిస్టుల ముప్పు

### ఢిల్లీవర్గాల అభిప్రాయం

న్యూఢిల్లీ, డిసెంబరు 1: నిన్న చుంకింగ్ నగరాన్ని ఆక్రమించుకొన్న కమ్యూనిస్టు సేనలు, యిక ఏమిటి వెంటనే టిబెట్‌పై దాడి పురోగమిస్తారా? అని యిక్కడి రాజకీయ అభిజ్ఞులు ఊహిస్తున్నారు. అయితే అధికారవర్గాలలో విచారించగా వచ్చే వేసవికాలం దాకా కమ్యూనిస్టులు, టిబెట్‌లో చొరబడే సావకాశం లేదని, అని ప్రాయ పడుతున్నట్లు తెలియవచ్చింది.

కమ్యూనిస్టుచైనా అధికారులు, టిబెటుపై సైనికంగా తమ ఆధిపత్యాన్ని కోరవచ్చునని అయితే, చైనాలో వారు తమస్థితి బలపర్చుకొన్న తరువాతనే యిది సాధ్యమని అధికారవర్గాలవారు అనుకుంటున్నారు. టిబెట్‌లో దీర్ఘకాలంగా, మతాధికారుల ఆధిపత్యం సాగుతుండడం అనాదిగా ప్రజలు దరిద్రజీవితం గడుపుతుండడం యివి కమ్యూనిస్టులు టిబెట్‌లో తేలికగా చొరబడటానికి మంచి అవకాశం యివ్వవచ్చును.

ముందు ముందు టిబెట్ ప్రభుత్వం భారతప్రభుత్వాన్ని సైనికసహాయం వేడితే, అసహాయం భారతప్రభుత్వంచేస్తుందా అని అడుగగా, సైనిక సామగ్రి భారత ప్రభుత్వం పంపడంగాని లేదా టిబెట్ ప్రజలకు తోడుగా తమసైన్యాలను పంపడంగాని అసంభవం. కమ్యూనిస్టులసైన్యం 40 లక్షలు. లెనిన్ నాయకత్వంక్రింద సోవియట్‌రష్యా విజయం పొందినతరువాత, వెర్న్‌స్కీ ప్రభుత్వానికి బ్రిటన్ తోడ్పడజానికి ప్రయత్నిస్తే యేంజరిగిందో అదే జరుగుతుంది" అని యీ అధికార వర్గాలవారు అన్నారు.

వెంటనేగాకపోతే తరువాతైనా కమ్యూనిస్టులు టిబెట్‌ను పాదాక్రాంతం చేసుకొనే సందర్భం వచ్చినప్పుడు ప్రభుత్వం యేంచేయదలచింది అనగా ప్రభుత్వం చేయదలచిందల్లా తమదేశ సరిహద్దులను రక్షించుకోవడమే నని యీ అధికారులు అన్నారు.

## టిబెట్‌లోని భారత ప్రతినిధి అభిప్రాయం

ఢిల్లీ, డిసెంబరు 1: సిక్కింలో భారత ప్రభుత్వ ప్రతినిధిగా ఉంటున్న హరీశ్వర దయాలుగారు ఇటీవల ఇండియా గవర్నమెంటువారి ఉత్తర్వుల ననుసరించి టిబెట్టుకు వెళ్లి అచటి రాజకీయ పరిస్థితులను పరిశీలించి తిరిగి సిక్కింలోని ముఖ్య నగరమైన గంగటోకుకు వచ్చిరి. వచ్చే వారంలో వీరు ఢిల్లీకివచ్చి టిబెట్టులో తాము గమనించిన విషయమును ఇండియా ప్రభుత్వ విదేశాంగ శాఖమంత్రికి నివేదించెదరు. టిబెట్టులోనికి చైనా కమ్యూనిస్టుసేనలు ప్రవేశిస్తే ఆటంకపరచేది ఏమీలేదు. ప్రస్తుతం చైనాలోని కమ్యూనిస్టు ప్రభుత్వము తన సొంత సమస్యలను పెక్కింటిని పరిష్కరించుకొనవలసియున్నది. కనుక, టిబెట్టులోనికి ప్రవేశించుటకు కొంత కాలము పట్టును. ప్రస్తుతం టిబెట్టులో కమ్యూనిస్టు చర్యల మూలంగా ఏర్పడిన కల్లోలం ఏమీలేదు.

## పౌర విమానయానం

### కిద్వాయ్ ఆరోపణలకు బెహ్రూర్ సమాధానం

బొంబాయి, డిసెంబరు 1: పౌర విమానయానం గురించిన నిన్న టి పార్లమెంటు చర్చలో రవాణాల మంత్రి రఫీ అహమ్మదు కిద్వాయ్ చేసిన ప్రకటనకు విమాన రవాణాల సంఘాధ్యక్షుడు గురునాథ్. బెహ్రూరు సమాధానం చెబుతూ విమాన పరిశ్రమ వారడుగుతున్నదల్లా పరిశ్రమనుగురించి న్యాయమైన విచారణ మాత్రమే నన్నారు.

ఎయిర్‌ఇండియా వారు ప్రైవేటుగా విమానాలు కిరాయి తీసుకొన్న వారికి కంటె ప్రభుత్వానికి ఎక్కువ చార్జీ చేసి ఉండలేదనీ, విమాన కంపెనీలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా కట్టు కట్ట లేదనీ, పెట్రోలు పన్ను మూలానా వల్ల 1949 లో ఎయిర్‌ఇండియాకు 11 లక్షలు లాభం రాదనీ విమానాలలో టపా తీసుకొని పోయినందుకు టాటా కంపెనీ వారు మైలుకు 5 రూపాయలు వసూలు చేయలేదనీ అన్నారు.

పార్లమెంటు చర్చలో భారత ప్రధాని ఈ సమస్యను గురించి న్యాయంగాను నిష్పాక్షికంగాను మాట్లాడారనీ, ప్రభుత్వ సలహాతో ఈ సమస్యను గురించి విచారణ జరుగుతుందని ప్రధాని అభయం ఇచ్చినందుకు పరిశ్రమలవారు కృతజ్ఞులై ఉంటారనీ, ఈ పరిశ్రమ యొక్క స్థితిగతులనుగురించి న్యాయమైన విచారణ జరగడం మాత్రమే విమాన కంపెనీలకు కావలసినదని, దాదాపు విమాన కంపెనీలన్నీ క్లిష్ట పరిస్థితిలో ఉన్నవి కనుక ఈ విచారణ త్వరలో జరగడం అవసరమనీ బెహ్రూర్ అన్నారు.

## వచ్చే ఏడాది 20 లక్షల టన్నుల ఆహారధాన్యం దిగుమతి

న్యూఢిల్లీ, డిసెంబరు 1: వచ్చేఏడు 20 లక్షల టన్నుల ఆహారధాన్యాన్ని విదేశాలనుండి దిగుమతి చేసుకొనుటకు భారతప్రభుత్వం సంకల్పించినట్లు సూచనగా తెలుస్తున్నది. ఇందులో 1 లక్ష టన్నులు బియ్యం. ఈ ధాన్యాన్ని స్టెర్లింగు దేశాలనుండె దిగుమతి చేసుకోవడం జరుగుతుంది.

# అల్యూమినియంపరిశ్రమకు మరి మూడేళ్లపాటు రక్షణ

## టారిఫ్‌బోర్డు శిఫార్సులననుసరించి అధినివేశ శాసనసభ నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబరు 1: టారిఫ్‌బోర్డువారి శిఫార్సుల ననుసరించి అల్యూమినియము పరిశ్రమకు మరి మూడేళ్లపాటు రక్షణ ఇవ్వడానికి నేడు భారత పార్లమెంటువారు నిర్ణయించారు.

టారిఫ్‌బోర్డువారింకా విచారణలు సాగించనున్నారని వాణిజ్య మంత్రి కే. సి. నియోగి అన్నారు. రక్షణల నివ్వడంవల్ల పరిశ్రమలు బలహీనం కావనీ, రక్షణలమూలంగానే ఈ దేశంలో నేత, ఉక్కు మొదలైన పరిశ్రమలు అభివృద్ధికాగలిగినవనీ నియోగీ అన్నారు. రక్షితపరిశ్రమలలో ప్రభుత్వానికి ఎక్కువ వాటా ఉండాలన్న అనంతశయనం అయ్యంగారి సూచనను నియోగీ ఆమోదించలేదు. టి. టి. కృష్ణమాచారి, అనంతశయనం అయ్యంగార్లు రక్షణలను విమర్శించారు, ప్రొ. రంగా బలపరిచారు.

—అల్యూమినియంమీద రక్షణ సుంకాలు విధించడానికి వీలుగా 1934 భారతసుంకచట్టాన్ని సవరణ చేయడానికిగాను వాణిజ్య మంత్రి కే. సి. నియోగి తెచ్చిన బిల్లుపై నేడు అధినివేశ పార్లమెంటులో చర్చ జరిగింది.

అదివరకే అల్యూమినియముమీద కిమ్మతువారీ పన్ను నూటికి 30 వంతున, టారిఫ్ బోర్డు శిఫార్సుల ననుసరించి, అమలులో ఉన్నది. రక్షణ ఫలవంతం కావడానికిగాను ఈ సుంకాన్ని పొడుగించే నిమిత్తమై పార్లమెంటులో, చట్టం ఏర్పరచవలసి వచ్చింది.

బిల్లును ప్రతిపాదిస్తూ నియోగీ ఈవిధంగా చెప్పారు:

అల్యూమినియం పరిశ్రమ ఆర్థికంగా దేశానికి అవసరమైనది. అల్యూమినియం పారిశ్రామికులకు ధనరూపేణా సహాయం చేస్తూ, అల్యూమినియం దిగుమతులపై సుంకం విధించాలని టారిఫ్‌బోర్డువారు శిఫార్సు చేశారు. ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన అధికారసంఘంవారుకూడా ఈశిఫార్సులను బలపరిచారు.

అల్యూమినియం ధరలు నిర్ణయించడానికి తాత్కాలికంగా ఏర్పాటుచేయబడిన కూడలి చేసేపనికి భగ్నం అయే పరిస్థితి వాటిల్లింది. అందుచేత పై శిఫార్సులు అమలు జరపడానికై ప్రభుత్వం అవసర చర్యలు తీసుకోవలసివచ్చింది.

అన్ని లోహాలలోకి అల్యూమినియం ధర మాత్రమే పడిపోయింది. 1939 లో 84 రూపాయల ధర ఉండిన అల్యూమినియం ఇప్పుడు 75 రూపాయ లున్నది. అల్యూమినియం పారిశ్రామికులు తమ కివ్వబడిన రక్షణలతో తృప్తిపడలేదుగాని ద్రవ్యమారకం రేటు తగ్గింపువారిని రక్షించింది. ఏమంటే ఈ లోహాన్ని అమ్మడంలో పోటీ చేస్తూవచ్చినది కెనడా. ఇప్పుడు కెనడా అల్యూమినియం ధర చాలా పెరిగింది. మరి మూడేళ్లపాటే రక్షణ కొనసాగించబడుతుంది. దీనివల్ల అల్యూమినియం వాడుకొనేవారికి ఏమీ నష్టం లేదు. టారిఫ్‌బోర్డువారు తమ విచారణలను ఇంకా సాగిస్తారు. ఈ మూడేళ్ళలోగా అల్యూమినియం ఉత్పత్తి ఖర్చులు దిగిపోవచ్చు.

టి. టి. కృష్ణమాచారి బిల్లును వ్యతిరేకిస్తూ, టారిఫ్‌బోర్డువారి నివేదికలను గురించీ, ఉత్పత్తి ఖర్చులు వగైరాలనుగురించీ, సభ్యులకు వివరాలు తెలుపాలనీ, 5, 10 ఏళ్ళుగా పరిశ్రమలకు కృత్రిమంగా బలం చేకూర్చబడుతూ ఉన్నదనీ, ఈ పరిశ్రమ పొదుపైన పద్ధతులలో నడుస్తున్నదనితనకు నమ్మకంలేదనీ, పారిశ్రామికులు తమలాభాలను తగ్గించుకొని తద్వారా ధరలు తగ్గించవలసిన తరుణం ఆసన్నమయిందనీ, టారిఫ్ బోర్డుగాని, వాణిజ్య పారిశ్రామికశాఖలుగాని పారిశ్రామికులను నిజంగా దారిలోకి తీసుకొనిరావడంలేదని తన అభిప్రాయమనీ అన్నారు.

టారిఫ్‌బోర్డు శిఫార్సులు సభ్యులకు తెలుపనందుకూ, వివరాలివ్వనందుకూ అనంతశయనం అయ్యంగారు కూడా వాణిజ్యశాఖను విమర్శించారు. ద్రవ్యమారకంరేటు తగ్గింది కనుకనూ, దివిన్యూపన్ను విధించబడ్తున్నది కనుకనూ, ఓపెన్ జనరల్ లైసెన్సు పద్ధతి అంతమయింది కనుకను, అల్యూమినియం పరిశ్రమకు రక్షణ ఇవ్వవలసిన అవసరం యింకా ఉంటుందా అన్న విషయం టారిఫ్‌బోర్డువారు అన్వేషించేవరకూ ఈ బిల్లును నిలిపిపెట్టి ఉంచాలని ఆయన అన్నారు. ప్రభుత్వం ఏ బిల్లు ప్రవేశపెట్టినా ఆమోదించడానికి తాను రబ్బరు స్టాంపు కాననీ, ద్రవ్యమారకంరేటు తగ్గింపు వగైరాలవల్ల అల్యూమినియం పరిశ్రమకు తగిన రక్షణ ఏర్పడిందనీ, ఈ రక్షణ భారతీయ పారిశ్రామికులకే లాభిస్తుందో, దేశీయ నామాలు ధరించిన విదేశీ కంపెనీలకే లాభిస్తుందో తెలియదనీ అనంతశయనం అయ్యంగా రన్నారు.

ఆచార్యరంగా బిల్లును బలపరిచారు. కాని వివరా లివ్వనందుకు విమర్శించారు. టారిఫ్‌బోర్డువారి రిపోర్టు లైబ్రరీలో వున్నదని నియోగీ చెప్పగా, ఆ సంగతి సభికులకు చెప్పనందుకు రంగా కోప్పడి, సభ్యులను గౌరవంతో చూడా లన్నారు. ప్రభుత్వంవారు అల్యూమినియం పరిశ్రమకు రక్షణ లివ్వడమేకాక, రవాణా సౌకర్యాలూ విద్యుచ్ఛక్తీ పారిశ్రామికులకు అందించాలనీ, రెండు మూడేళ్ళ అనంతరం యింకా రక్షణలు అవసరమైతే కొనసాగించాలనీ రంగా ఉద్ఘాటించారు.

బి. దాసు (ఒరిస్సా) మాట్లాడుతూ, ఈ పరిశ్రమలో విదేశీపెట్టుబడి ఎంత ఉన్నదో ప్రభుత్వం ఆరా తీయాలనీ, కెనడా అల్యూమినియం పరిశ్రమ గుత్తపరిశ్రమ కనుక భారతీయ పరిశ్రమకు రక్షణ ఇవ్వడం న్యాయమేననీ, అయితే భారతీయ పరిశ్రమలో కెనడా గుత్తదార్ల ఆధిపత్యం ఎంత ఉన్నదీ, ఎంతమంది భారతీయ పారిశ్రామికులు కెనడా గుత్తదార్ల ఏజెంట్లయినదీ నిర్ధారణ కావాలనీ, దేశభద్రతకు అతి ముఖ్యమైన ఈ పరిశ్రమపై టారిఫ్‌బోర్డువారు ఒక కన్నుంచి, అవసరమైతే, ఈ పరిశ్రమకు ధనరూపమైన రక్షణ ఇవ్వడం గురించి పునర్విచారణ జరపాలనీ అన్నారు.

మాజీ ఒరిస్సా ప్రధాని బిశ్వనాథదాసు టారిఫ్‌బోర్డు సిఫార్సుల పట్లా, వాటిని ప్రభుత్వం అమలుజరిపే విధానంపట్లా సంపూర్ణమైన అసంతృప్తి ప్రకటించారు. ఈ పరిశ్రమయొక్క అభివృద్ధి గమనించడానికి ప్రభుత్వం ఎవరినీ నియమించి ఉండలేదు. టారిఫ్‌బోర్డువారి సిఫార్సులను ప్రభుత్వం నిర్లక్ష్యంగా అమలుజరిపి పేదప్రజలకు హానికలిగిస్తున్నది. అల్యూమినియం పరిశ్రమ ఒకమూలా, ముడిపదార్థం ఇంకొకమూలా ఉన్నది. జబ్బుపురంలో బాక్సైటు (అల్యూమినియం ఖనిజం) విరివిగా దొరకుతుంది. అక్కడే జలవిద్యుత్తుకు కూడా అవకాశాలున్నవి. అయినా ప్రభుత్వంవారు అల్యూమినియం పరిశ్రమను అక్కడ కేంద్రీకరించడానికి ప్రయత్నించడంలేదు. అల్యూమినియం పరిశ్రమకు ఇవ్వబడే రక్షణసహాయంలో ఎంత సొమ్ము పారిశ్రామికుల ఖజానాలలో చేరుతుంది? రాగల రెండు మూడేళ్లలో పరిశ్రమను అభివృద్ధిచేయడానికి పారిశ్రామికులేంచెయ్యబోతారు? ముడిపదార్థాలూ, విద్యుచ్ఛక్తీ కూడా లభ్యమయ్యే కోటా పూరువంటిచోట పరిశ్రమను కేంద్రీకరిస్తే క్లిష్టసమయాలలో రవాణాలపై ఒత్తిడి కలగకుండా ఉంటుంది.

ఆర్. కే. సిధ్వా మాట్లాడుతూ, టారిఫ్‌బోర్డు శిఫార్సులు సభ్యులకు అందజేయబడనందుకు విమర్శించారు. టారిఫ్ బోర్డువారు, తప్పో ఒప్పో, రక్షణలు ఇవ్వాలనే ధోరణిలో ఉన్నట్టున్నారు. ఈ విధానం మారాలి. 17 ఏళ్లుగా రక్షణ పొందుతున్న పంచదార పరిశ్రమ ఇప్పటికీ సవ్యమైన ధరకు పంచదార ఉత్పత్తి చేయలేకుండా ఉన్నది. ఇటువంటి పరిశ్రమలు సరిగా ప్రవర్తించనిచో ప్రభుత్వం వాటిని స్వయంగా నిర్వహించాలి. పరిశ్రమను జాతీయం చేయడం కాదు కనుక పరిహారం కూడా ఇవ్వనవసరంలేదు. ఎట్టి రక్షణా అవసరం లేకుండా అల్యూమినియం పరిశ్రమ స్వయంపోషకం కాగలదు.

హిమత్సింగ్కా బిల్లును పూర్తిగా సమర్థించి, అల్యూమినియం పరిశ్రమనష్టంతో సాగుతున్నది కనుక రక్షణ ఇవ్వాలన్నారు.

చౌదరి రణబీర్ సింగ్ మాట్లాడుతూ, రక్షణ పరిశ్రమలకూ, రెండు మూడేళ్లలో విదేశీ పోటీకి తట్టుకోగల పరిశ్రమలకూ మాత్రమే రక్షణ సహాయం చేయబడాలనీ, బొంబాయి కలకత్తాలవంటి పట్టణాలలో పరిశ్రమలు కేంద్రీకరించబడరాదనీ, అల్యూమినియం పరిశ్రమను తూర్పు పంజాబులో స్థాపించాలనీ అన్నారు.

## నియోగీ సమాధానం

చర్చకు సమాధానం చెబుతూ వాణిజ్య మంత్రి కే. సి. నియోగీ యీ విధంగా అన్నారు:

"టారిఫ్‌బోర్డువారి నివేదిక కాపీలు చాలా కొద్దిగా మాత్రమే ఉన్నందున సభ్యులందరికీ ఇవ్వడం సాధ్యంకాదు. ఇటువంటి ప్రచురణలకింద కాగితం యెక్కువ వ్యయం చేయరాదని పబ్లికువర్క్సు శాఖవారు ఆదేశించి ఉన్నారు.

మహావీరత్యాగి: దీనికి ఒప్పుకోం. సభ్యులకు కాపీలు అందాలి.

పార్లమెంటు అధ్యక్షుడు మావ్లంకరు అడ్డంవచ్చి, ప్రతిప్రచురణకూ అనేక కాపీలు వేయించడంవల్ల కాగితం వృథాగా వ్యయం అవుతున్నదనీ, ఇకముందు సభ్యులు కాపీలకొరకు ముందుగా అడిగితే వారికి కాపీలు అందజేయబడగలవనీ అన్నారు.

నియోగీ టారిఫ్‌బోర్డునుగురించి చెబుతూ దాని భవితవ్యం ఫిస్కల్ కమిషను శిఫార్సులపై ఆధారపడి ఉంటుందన్నారు, భిన్న ప్రాతినిధ్యాలు గల రెండు టారిఫ్ బోర్డులు అల్యూమినియం పరిశ్రమకు రక్షణ సహాయం జరగాలని శిఫార్సు లిచ్చినవి. పరిశ్రమల స్థాపనవిషయమై ప్రభుత్వాన్ని విమర్శించ నవసరంలేదు. అందులో ప్రభుత్వప్రమేయం ఏమీలేదు. ఇకముందుప్రభుత్వంవారు నిర్దిష్ట విధానాలను అనుసరించి ముడిపదార్థాలు అందుబాటులో ఉండేలాగు పరిశ్రమలు నెలకొనేటట్టు చూడగలరు.

ప్రస్తుతానికి మూడేళ్ళపాటు రక్షణ ఇవ్వబడుతున్నప్పటికీ మరొక సంవత్సరం కాలంలో టారిఫ్ బోర్డు విచారణ సాగించగలదు. అప్పటికి ద్రవ్యమారకంరేటు తగ్గింపువగైరాల ఫలితాలు తెలియగలవు.

రక్షణఇవ్వడంలో వినియోగించేవారికి నష్టంకలుగుతున్నదన్నది నిజం కాదు. వారిదృష్టినుంచి ఇది ఉత్తమమైనపని. దిగుమతిసరుకుకు దేశీయసరుకుకు ధరలో గల వ్యత్యాసంలో సగంసుంకాలద్వారాను, మిగిలినసగం పారిశ్రామికులకు ద్రవ్యసహాయంద్వారాను నిర్మూలించబడుతున్నది. ఉత్పత్తిఖర్చులు తగ్గితే ధనసహాయం జరగదు.

రక్షణ ఇవ్వబడుతున్న సంస్థలలో ఒకటి అధికంగా విదేశీపెట్టుబడులుగలదే. అయినా విదేశీపెట్టుబడులను గురించి భారతప్రధాని చెప్పినమాటలు సభ్యులు గుర్తుంచుకోవాలి. విదేశీకంపెనీలకు స్వదేశీకంపెనీలకిచ్చే సౌకర్యా లివ్వబడలేదని ఆయనఅన్నారు. ద్రవ్యసహాయం విదేశీ కంపెనీలకూ జరుగుతుంది. ప్రభుత్వం రక్షిస్తున్నది, పరిశ్రమనంతటినీగాని, కొన్ని పారిశ్రామిక సంస్థలనుకాదు. ఈ సంస్థలు ఉత్పత్తిసంగా సాగించేలాగు చూడడానికి టారిఫ్‌బోర్డువారు అప్పుడప్పుడు విచారణలు జరుపుతున్నారు.

సభ్యులు రక్షణవిధానాన్నే విమర్శించడం భావ్యంకాదు. రక్షణమూలంగానే ఈ దేశంలో నేత, ఉక్కు వగైరా పరిశ్రమలు అభివృద్ధి అయినవి. అన్ని దేశాలలోకీ మనదేశంలో ఉక్కు ధర చాలా తక్కువగాఉన్నది. రక్షణలవల్ల పరిశ్రమల అసమర్థత బలపడుతున్నదనడం సరికాదు.

విదేశీయులు నడిపే అల్యూమినియం సంస్థయొక్క స్వరూపంలో మార్పులు చేయడం ఉచితమేమో విచారిస్తారా అని అనంతశయనం అయ్యంగారు అడుగగా లేదని నియోగీ సమాధానం చెప్పారు. పార్లమెంటుకు శాసనాలు చేసే అధికారమూ, ప్రభుత్వానికి చర్యలు తీసుకొనే అధికారమూ ఉన్నప్పటికీ, అనేక ఏళ్లుగా పనిచేస్తూ రక్షణపొందే అర్హత గల సంస్థపై నిర్బంధాలు పెట్టడం తన కిష్టంలేదని నియోగీ చెప్పారు.

అంతటితో చర్చ ముగిసి బిల్లు ఆమోదించబడింది.

## ఢిల్లీరోడ్డు రవాణా నిర్వహణ సంస్థ బిల్లు

ఢిల్లీరోడ్డు రవాణా నిర్వహణ సంస్థ బిల్లును సెలెక్టుకమిటీకి నివేదించాలని కే. సంతానం చేసిన ప్రతిపాదనపై చర్చ జరిగింది.

టి. టి. కృష్ణమాచారి ఢిల్లీ బస్సులను తీవ్రంగా నిరసించారు. ఈ రవాణా సౌకర్యాలను ప్రభుత్వం కొనడంవల్ల పూర్వపు యజమానులు బాగుపడ్డారు. రాజ్యాంగ పరిషత్సభ్యులు ప్రయాణించే అందమైనబస్సులు మినహాయిస్తే మిగిలినవన్నీ శోచనీయమైన పరిస్థితిలోఉన్నవి. బిల్లు రచననుకూడా కృష్ణమాచారి విమర్శించారు. రవాణా నిర్వహణసంస్థలో దక్షులైనవారు నియమించబడి స్వేచ్ఛగా పనిసాగించాలి. రవాణాలమీద 10 లక్షలు లాభంవచ్చిందని సంతానం అన్నారు. సరిఅయినకొలతనాలుపెట్టి మరమ్మతులు జరిపితే లాభం ఇంతఉండదు.

తిరుమలరావుకూడా ఢిల్లీ బస్సులను తీవ్రంగా విమర్శించారు. రవాణాలబాధ్యతను ఈ బిల్లు పూర్తిగా ప్రభుత్వంమీదే వేస్తున్నది. ఇదే జరగవలసిఉంటే కొద్దిమంది అధికారులను కంట్రోలునిమిత్తం నియమించి, వారిపై పార్లమెంటు అజమాయిషీ ఉంచడం మంచిది. నిర్వహణసంస్థ అధికారులకు అంతులేని అధికారాలివ్వబడడంకూడా తిరుమలరావు విమర్శించారు.

నిర్వహణసంస్థ కివ్వబడిన అధికారాలు కొన్ని అస్పష్టంగా ఉన్నవనీ, ఈ సంస్థమీద కేంద్ర ప్రభుత్వం కంట్రోలు ఉంచబడిందనీ, ఇందులో పనిచేసే అనధికారుల అర్హతలు నిర్వచించబడలేదనీ అజిత్ ప్రసాద్ జైన్ విమర్శించారు.

బిల్లులో కార్మికుల ఉపయోగానికీ, ప్రావిడెంటుఫండుకూ సౌకర్యాలు లేవని కృష్ణమూర్తిరావు విమర్శించారు.

అలగేశన్ రవాణాశాఖను అభినందిస్తూ ఈబిల్లు రాష్ట్ర రవాణా శాఖలకు ఆదర్శంగా ఉండగలదన్నారు. కాని నిర్వహణ సంస్థకు మోటారు వాహనాలచట్టమున్న విధానమూ వర్తించాలని ఆయన సూచించారు.

## సంతానం సమాధానం

సంతానం చర్చకు సమాధానం చెబుతూ సభ్యులు చెప్పిన అంశాలను సెలెక్టుకమిటీవారు ఆలోచించగలరనీ, ఈబిల్లు తొందరలో తయారుచేయబడిందనీ, ప్రభుత్వశాఖవారు తమ అభ్యంతరాలను సెలెక్టుకమిటీకి తెలుపగలరనీ, ఈ బిల్లులోని కొన్ని అంశాలు, ముఖ్యంగా కార్యనిర్వాహకులకు సంబంధించినవి, ప్రోవిన్సురవాణాచట్టమునుండి తీసుకోబడినవనీ, బస్సులను ప్రభుత్వం పుచ్చుకొన్నప్పుడు జమాఖర్చులు రెండూ భారీగానే ఉన్నవనీ అన్నారు.

పారిశ్రామిక ద్రవ్యసంస్థ రిజర్వుబ్యాంకు మొదలైన సంస్థల విషయంలోలాగే ఈ రవాణా నిర్వహణ సంస్థలోకూడా పార్లమెంటు సభ్యులకు స్థానం లేకుండా చేయబడిందని సంతానం అన్నారు.

ఈబిల్లును సెలెక్టుకమిటీకి నివేదించడానికీ వారు డిశెంబరు 12 లోగా తమ నివేదిక పంపడానికీ సభవారామోదించారు. సభ రేపటికి వాయిదాపడింది.

## ఇండియాలో పవర్ ఆల్కహాల్ ఉత్పత్తి

న్యూఢిల్లీ, డిసెంబరు 1: 1949 ఆగస్టు నెలవరకూ ఇండియాలో, 21,68,864 గ్యాలన్ల పవర్ ఆల్కహాల్ ఉత్పత్తి చేయబడినదని 1948 లో 3542 వేలు, 1947లో 22 లక్షల గ్యాలన్లు ఉత్పత్తి చేయబడినదని పరిశ్రమల మంత్రి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ పార్లమెంటులో తెలియజేశారు.

పెట్రోలు, పవర్ ఆల్కహాల్ 1:4 నిష్పత్తిలో కలుపబడునని, దీని ధరను, రాష్ట్రప్రభుత్వాలు కంట్రోలు చేస్తున్నవని, అయితే యిటీవల ఆమోదించిన చట్టమును కేంద్రప్రభుత్వం అమలుజరుపదలచిందని ముఖర్జీ తెలియజేశారు. "ఆల్కహాల్ బట్టీలను, పవర్ ఆల్కహాల్ ఫ్యాక్టరీలక్రింద మార్చుకోనీయమని బొంబయి ప్రభుత్వం అడిగింది, ఈ విషయమై ప్రభుత్వం పరిశీలిస్తున్నది. పవర్ ఆల్కహాల్ పంపిణీ విషయమై నూనెకంపెనీలతో ఒడంబడికలు చేసుకుంది" అని ముఖర్జీ అన్నారు.

## తూర్పు పడమటి కోస్తాల రాధారి నౌకలు

న్యూఢిల్లీ, డిసెంబరు 1: తూర్పు పడమర కోస్తాలలో 2500 రాధారి నౌకలున్నవని, వీటి మొత్తం పరిమాణం 150 వేల టన్నులని, వాణిజ్యమంత్రి కె. సి. నియోగి పార్లమెంటులో సిధ్వాప్రశ్నకు సమాధానమిస్తూ వెల్లడించారు.

రాధారి నౌకల తాలూకు కమిటీ శిఫార్సులను, అందుకు సంబంధించినవారి సమాధానాలు రాగానే, ప్రభుత్వం పరిశీలిస్తుందని చెప్పారు.

1947 ఆగస్టు 15 నుంచి యిప్పటిదాకా, 7 ఇన్స్యూరెన్సు కంపెనీలు వ్యాపారం చాలించాయని, యిందులో మూడు దివాలాతీసినవని, రెండు మిగతా కంపెనీలతో కలిసిపోయినవని, రెండు కొత్త వ్యాపారం చేయడం మానివేశాయని, వాణిజ్యమంత్రి నియోగి, మాన్నో హుడ్ వాస్ ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

## యుక్రేన్‌లో అశాంతి?

యుక్రేన్ జాతీయవాదులు తిరిగి విద్రోహచర్యలు, గెరిల్లా ఉద్యమం, జాతీయతాప్రచారం కొనసాగించినట్లు తూర్పు యూరప్‌లోని బ్రిటిష్ ప్రభుత్వపు లోపాయికారీ వర్గాలద్వారా తెలుస్తున్నట్లు 'స్కాట్స్‌మన్' పత్రిక లండన్ ప్రతినిధి వ్రాస్తున్నాడు. మొత్తానికి కొంచం అశాంతి ఉన్నట్లు రష్యన్ వర్గాలే ప్రకటిస్తూ, అయితే అది అమెరికన్ ప్రతినిధులకుట్రలఫలితమని అన్నాడు. యుక్రేన్ దేశరక్షణ మంత్రి సాల్చెంకోను బర్తరఫ్ చేయటం అశాంతికి నిదర్శనంగా తీసుకోవచ్చునని స్కాట్స్‌మన్ ప్రతినిధి వ్రాస్తున్నాడు. (గ్లోబ్)

# తమ వలసభూభాగాలపై సమితి పరిశీలనకు బ్రిటన్ అసమ్మతి

## సర్వ సభ్య సమావేశంలో బ్రిటిష్ ప్రతినిధి విక్టర్ మెక్నీల్ స్పష్టీకరణ

ఫ్లషింగ్ మెడోస్, డిశంబర్ 1: "తన వలసలమీద అంతర్జాతీయ పర్యవేక్షణ నెలకొనటానికి బ్రిటన్ అంగీకరించదు." అని బ్రిటిష్ స్టేట్ మంత్రి హెక్టర్ మెక్‌నీల్ నేడు సమితి సర్వ సభ్య సమావేశంలో స్పష్టపరిచాడు.

పరిపాలిత ప్రాంతాల పరిస్థితుల విషయమై ధర్మకర్తృత్వ సంఘం తయారుచేసిన నివేదకను సర్వసభ్య సమావేశం చర్చిస్తుండగా మెక్‌నైల్ పైప్రకటన చేశాడు. సమావేశం చర్చను రేపటికి వాయిదా వేసింది.

ధర్మకర్తృత్వ సంఘ నివేదికలో ప్రతిపాదించబడ్డ 10 తీర్మానాల్లోనూ ఎనిమిది తీర్మానాలను బ్రిటన్ ప్రతిఘటించింది. మిగిలిన రెండింటి విషయంలో తటస్థంగా ఉన్నది.

"సమితి ప్రణాళిక వలసల విషయమై కోరిన సమాచారాలన్నిటినీ ఒక బ్రిటన్ తెలియజేసింది. ఒకప్రాంతం పూర్తిగా స్వపరిపాలన కలదయితేనే తప్ప లేకపోతే పాలకదేశాలు నిరంకుశంగా పరిపాలిస్తవనీ, పాలితప్రజలకు ప్రభుత్వంలో భాగమేఉండదనీ ఒక దురభిప్రాయం జాస్తిగా వ్యాపించినది. దానిని తొలగించాలని బ్రిటన్ ఎంత ప్రయత్నించినా లాభం లేకుండా పోతున్నది. బ్రిటిష్ వలసలలోని ప్రజలకు తమకు సంబంధించిన విషయాలన్నిటిలోనూ స్వేచ్ఛగా చెప్పే హక్కు ఉన్నది.

పాలితప్రజల యోగక్షేమం లేకుండా విధానాలను నిర్ణయించి, వారిచేత వాటిని అనుసరింపచేసి తద్వారా 'కాలానికి ఎదురీదటమన్న పిచ్చిపనిని బ్రిటన్ ఎప్పుడూ చేయదు. వలసల సమస్యలను పరిశీలించదలచినప్పుడు, సమితి ప్రత్యేక సంస్థలు ప్రాంతీయవారిగా పరిశీలించి సమితికి వార్షిక నివేదికలను సమర్పించటం ఉచితం" అని మెక్‌నైల్ వివరించాడు.

# యుగోస్లావియాలో రష్యన్ గూఢచారులు

## విచారణ ప్రారంభం

సారజేవో, డిశంబరు 1: యుగోస్లావియాలో సోవియట్ గూఢచారులుగా పనిచేసినవాళ్ళ విచారణ నేడు ప్రారంభమౌతున్నది. వీరంతా సోవియట్ పౌరులు.

సారజేవోలో జరుగుతున్న ఈ విచారణలో అభియోగులందరు తెల్ల రష్యనులు. వీరికి ఒక మతాధికారి నాయకుడుగా పనిచేసాడు. ఇవ్వాళ ఆయన కోర్టుకు నల్లటి దుస్తులుధరించి హాజరైనాడు.

ముందు ఈయన సోవియట్ రష్యాకు వ్యతిరేకంగా ఫాసిస్టుగూఢచారిగా పనిచేసినట్లున్నూ, తరువాత టిటోకు వ్యతిరేకంగా సోవియట్ రష్యాకోసం పనిచేసినట్లున్నూ ఆరోపణలు చేయబడినాయి.

ఈవిచారణలో అభియోగులైన వాళ్లకు మరణశిక్ష వుండదు. 20 ఏళ్లు కఠినవరకం మాత్రం శిక్ష విధించవచ్చు.

ఈ విధంగా విచారణకు తెచ్చిన వారి మొత్తం 12 దాకావుంది. అందులో లాడమిర్ సెక్లుడోవ్ అనే అతడు ఆత్మహత్య చేసుకున్నాడు. అంతకు తానుచేసిన తప్పును ఒప్పుకుంటూ ఒక కాగితాన్ని వ్రాసి, మరీ అతడు ఆత్మహత్య చేసుకున్నాడు.

ఇందులో తాను సోవియట్ రష్యా గూఢచారిగా యుగోస్లావియాలో పనిచేసినట్లు అతడు ఒప్పుకున్నట్లు యుగోస్లావ్ ప్రాసిక్యూటర్ కోర్టులో వెల్లడించారు.

# శాంతినికేతనంలో ప్రపంచశాంతిసభ

(1వ పేజీ తరువాయి)

నాథ్ టాగోర్ స్వాగతం చెప్పారు. పశ్చిమబెంగాల్ గవర్నర్ డా॥ కట్జూ సభను ప్రారంభించారు. డా॥ కట్జూ ఉపన్యాసాన్ని నిన్ననే ప్రకటించాం.

శాంతినికేతన శాంతి సభకు విచ్చేసిన ప్రతినిధులంతా అమృత పంజచ్ఛాయల్లో సమావేశమైనారు. సభా ప్రాంగణానికి వీరంతా బారులుతీరి నడుస్తూవచ్చారు. వీరిలో చాలామంది స్త్రీలు గూడా వున్నారు. వారిలో కొంతమంది గాంధీ టోపీలు ధరించారు. సియాల్‌కోటనుంచి వచ్చిన ఒకసిక్కు ఖాదీ అంగవస్త్రాన్ని ధరించి నిరాడంబరత్వం మూర్తి కట్టినట్లు కన్పించారు.

వేదమంత్ర పఠనంతో సభా కార్యక్రమం ప్రారంభమైంది. విశ్వ భారతి ప్రధానాధ్యాపకులు శ్రీ క్షితి మోహన సేన్ ప్రార్థనా గీతాలతో సభ ముగిసింది.

ఈ సభలు డిశంబరు 8 దాకా రోజూ జరుగుతూనే వుంటాయి. గాని, అవి నేటికి వలె బహిరంగ సమావేశాలుమాత్రంకాదు.

ఈ సమావేశం జయప్రదం కావాలంటూ దేశ విదేశాలనుంచి అనేక సందేశాలు వచ్చాయి. ముఖ్యంగా బాయిడ్ ఆర్, ఫ్రెండ్స్ శాంతిసంఘం (లండన్) శాంతి ప్రజ్ఞాసంఘం (ఆస్లో)ములు పంపిన సందేశాలను సభలో చదివారు. ఇండియాలో జరుగుతున్న ఈ సమావేశం ఏక ప్రపంచ ప్రభుత్వానికి ప్రాతిపదిక వేయగలదని ఆశిస్తున్నామని బాయిడ్ ఆర్ తన సందేశంలో అన్నారు. మహాత్మాగాంధీ ఈ యుగంలో అహింసాత్మకమైన సమాజానికి పునాదులు వేసారు. అది ఏకదేశంగా వుండిపోయింది. దాన్ని బహుదేశ పరివ్యాప్తం చెయ్యడమే ఈ సమావేశం ఆశయంగా పెట్టుకోవాలని ఆస్లోనుంచి వచ్చిన సందేశంలోవుంది.

డా॥ రాజెన్‌బాబు ఈ సభకు హాజరు కాలేకపోయిన కారణంగా శ్రీమతి అమృతకౌర్ అధ్యక్షత వహించింది. ఆమె తన ఉపన్యాసంలో ఈలా అన్నది:

ఈ సభకు అధ్యక్షత వహించడానికి రాజెన్‌బాబు రాలేకపోవడం దురదృష్టం. ఆయనకు గాంధీజీతోవున్న పరిచయం మాట అట్లావుంచినా, ఇటువంటిసభకు అధ్యక్షత వహించగల తాహతు ఆయనకు ఒక్కడికేవున్నది. ఈ సమావేశం జరపడానికి ఆయన చేసినకృషి అవిరళమైంది.

ఇవ్వాళ్ల ఇక్కడ ఈ సమావేశం ఎందుకు జరుగుతున్నదో ప్రతినిధులందరికీ తెలిసిన విషయమే. రెండు ఘోరయుద్ధాలు జరిగినా, తిరిగి ఇంకోయుద్ధంకోసం అప్పుడే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అందువల్ల అంతా గాంధీజీచూపిన శాంతి మార్గంమీదికి దృష్టులు మళ్లించారు. మన దురదృష్టవశాత్తు ఆయన ఇప్పుడులేరు. కాని ఆయనఆత్మ ఎప్పుడూ ఇచ్చట మసలుతూనే వుంటుంది.

ప్రపంచమంతా యుద్ధాగ్నులతో సంక్షుభితమై పోతూవుంటే, ఆయన ఒక్కడే చెక్కుచెదరకుండా నిలబడి ప్రపంచానికి శాంతివాద బిక్షపెట్టారు.

నిజానికి మనుష్యుడు సహజంగా శాంతివాది, శాంతిప్రియుడు, ఐట్లా కానిపక్షంలో జీవితంలో ప్రతిక్షణమూ దుర్భరమే అవుతుంది. అయినా మానవునికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడానికి ఆయుధ సంఘర్షణకన్నా వేరేమార్గం లేదని చాలాభ్రమిస్తున్నారు. ఇటువంటి భావం వారికి కలుగుతోందంటే మానవసమాజంలో ఎక్కడో ఒకలోపంవుండి తీరాలి. ఆలోపాన్ని పట్టి, సర్దుబాటుచేయడానికే మనమిక్కడ సమావేశమౌతున్నది.

యుద్ధాన్ని పరిహరించే జీవితమార్గానికి గాంధీజీ దారులు దిద్దారు. ఆయన రోజూ ప్రార్థనా సమావేశాలలో తీసికొనేపదకొండు ప్రతిజ్ఞలను మనం జాగ్రత్తగా పరిశీలించగల్గితే ఆమార్గం ఏమిటో మనకు గోచరిస్తుంది. ఆయన తన సర్వకార్యరంగాన్ని అహింసమీద నడిపారు. సత్యం దానికి ప్రాణం. అందువల్ల సత్యాహింసలు ఆధార ఆధేయభావం కలవి.

ఈ సభలో పాల్గొనడానికి చాలా దేశాల మన స్నేహితులు వచ్చారు. వారి వారి అనుభవాలుగూడా మనం విందాం. అంతా కలిసికూర్చుని శాంతికి పునాదులు వేద్దాం.

మనం శాంతికి ఆకరమైన శాంతి నికేతనంలో సమావేశమౌతున్నాం. అందువల్ల టాగోరు గురుదేవుని గీతాల్లోంచి ఒక ముఖ్యగీతంతో నా ఉపన్యాసాన్ని ముగిస్తాను.

"నీవు ఉద్దేశించినట్లు నడిచేతాహత్తును నాకు ప్రసాదించు; మాట్లాడే శక్తిని ఇయ్యి; భగవంతుడా! సర్వసంగపరిత్యాగంచేయగల శక్తిని నాకు ప్రసాదించు."

"ప్రేమ ధర్మంలో నాకు అభినివేశం కల్పించు; మృత్యువులో అమృతత్వాన్ని చూపనీ; అపజయంలో విజయాన్ని అనుభవించనీ; సౌందర్యంయొక్క లాలిత్యంలో నిష్ఫలంగావున్న శక్తిని పరికించనీ, ప్రతీకారకాంక్షలేనిమెత్తనిబాధయొక్క తీవ్రతను అనుభవించే శక్తిని ఓ భగవంతుడా! నాకు ప్రసాదించు:

గురుదేవుని ఈ ప్రార్థనా వచనాలు మనలోవుండి, మన కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా సాగించగలవని నేను ఆశిస్తున్నాను.

# స్టెర్లింగ్ బాకీలు

1వ పేజీ తరువాయి

స్టెర్లింగ్ బాకీ మొత్తంనుంచి మినహాయించడం జరిగినదని, ఇంకా యిలాంటివి కొన్ని మిగిలిఉన్నవని, అవికూడ త్వరలోనే పరిష్కారమవగలవని ఆశిస్తున్నామని క్రిప్స్ సమాధానమిచ్చాడు.

యుద్ధకాలంలో బ్రిటన్ చేసిన సహాయానికి ప్రతిఫలం, స్టెర్లింగ్ బాకీదేశాల నుంచి ఎప్పుడు కోరతారు అని క్రాస్‌మెయిట్ అడుగగా, అలాంటి ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదని క్రిప్స్ సమాధానం చెప్పాడు.

ప్రభుత్వం స్టెర్లింగ్ నిల్వల సమస్యను పరిష్కరింపలేక పోయినదని, యీ నిల్వలు వాస్తవానికి యుద్ధంమూలంగా అయిన బాకీలేనని, క్రాస్‌మైట్ చర్చ సందర్భంలో అన్నాడు. ఈ స్టెర్లింగ్ నిల్వలను ఒక్క ఇండియాయేగాక మిగతా దేశాలుగూడా రాబట్టుకోవడానికి బ్రిటన్ అనుమతించిందని, ఇలా అనుమతించడం మూలంగా, బ్రిటన్ పొదుపుచేసుకున్న డాలర్ నిల్వలు తరిగిపోవడం, గాక వేరేమీ సంభవించడం లేదని, క్రాస్‌మైట్ అన్నాడు.

## రౌండ్‌టేబిల్ సమావేశం

బ్రిటన్ స్టెర్లింగ్ బుణాలు యివ్వతేలిన దేశాలతో రౌండ్ టేబిల్ సమావేశం ఒకటి యేర్పాటుచేసి స్టెర్లింగ్ బుణాలసమస్య చర్చించాలని, మాంచెస్టర్ గార్డియన్ ఆర్థిక వ్యవహారాల సంపాదకుడు యివ్వాళ సూచించాడు.

ఖజానామంత్రి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ గతమాసం పార్లమెంటులో ప్రసంగిస్తు, స్టెర్లింగ్ బాకీమొత్తముల విడుదలకు సంబంధించి బ్రెజిల్, సిలోన్, ఈజిప్టు, ఇండియా, ఇరాక్, ఇస్రాయిల్, పాకిస్తాన్, స్వీడన్ యురుగ్వేలతో చేసుకొన్న ఒడంబడికలు అమలు జరుగుతున్నవని, 1949 సంవత్సరంలో మొదటి తొమ్మిది నెలల్లోనూ 206 మిలియన్ల పౌనులు విడుదల చేయబడినవని వెల్లడించాడు.

స్టెర్లింగ్ సమస్యను వీలైనంత త్వరలో బాగా పరిష్కరించ గలమని, స్టెర్లింగ్ విడుదలకూడా చాలా పరిమితంచేయగలిగామని, యింకా పరిమితం చేయవచ్చునని ప్రభుత్వం అభిప్రాయ పడుతున్నది. నిజానికి కొన్ని దేశాలు స్టెర్లింగ్ బాకీని వసూలు చేసుకోవడానికి బదులు, క్రమేణ బాకీ మొత్తాన్ని పెంచుకొంటున్నవి. ఈ దేశాలు ఆస్ట్రేలియా న్యూజిలాండ్‌లు.

ఎదుటిపక్షం అంగీకారం లేకుండా తనంత తానే బాకీమొత్తాన్ని ఎగవేయడం ఏదేశానికైనా ముఖ్యంగా స్టెర్లింగ్ ప్రాంతానికి బ్యాంకర్‌గాఉన్న బ్రిటన్‌వంటి దేశానికి చాలా తీవ్రమైన వ్యవహారమని ప్రభుత్వ సన్నిహిత వర్గాలవారు అభిప్రాయపడుతున్నారు.

# ప్రపంచ శాంతిరక్షణ

(1-వ పేజీ తరువాయి)

మీద ముందు విడివిడిగా వోటింగు జరిపి, అమీద మళ్లీ ఏకమొత్తంగా తీర్మానాన్ని వోటుకుపెట్టడమైనది. తీర్మానంలోని ప్రతిక్లాజుకు యాభైఒకటి యాభైనాలుగు మధ్యగా వోట్లుపడ్డవి రష్యా, తూర్పు యూరప్ రాజ్యాలూ కొన్ని క్లాజులమీద తటస్థంగా ఊరకున్నవి తక్కిన వాటికి వ్యతిరేకంగా వోటుచేసినవి. అగ్రరాజ్య పంచకం శాంతి ఒడంబడిక చేసుకోవాలని చెబుతూ రష్యా ప్రతిపాదించిన తీర్మానమును 41 దేశాలు ప్రతిఘటించినవి. 10 దేశాలు తాటస్థ్యం వహించినవి. "అనేక దేశాలలో ముఖ్యంగా అమెరికా బ్రిటన్లలో జరుగుతున్న యుద్ధసన్నాహాలను" గర్హిస్తూ తీర్మానంలో ఉన్నభాగాన్ని రష్యా, రష్యా ఉపగ్రహ రాజ్యాలుతప్ప తక్కినవన్నీ ప్రతిఘటించినవి; యుగోస్లావియా ఎమెన్లు మాత్రం తటస్థంగా ఊరకున్నవి.

అంతర్జాతీయ కంట్రోలుద్వారా అణ్వస్త్రాలను వేమరతుగా నిషేధించాలని కోరుతూఉన్న భాగాన్ని 39 దేశాలు ప్రతిఘటించినవి, 15 దేశాలు తాటస్థ్యం వహించినవి. జనరల్ అసెంబ్లీలో ఏ అంశంమీద ఇంతఉద్విగ్నంగా ఇదివరకుచర్చ జరగలేదు; ఈ తీవ్రచర్చ నేటితో పైజెప్పినవిధంగా ముగిసింది.

# శ్రీ కళా వెంకట్రావుగారు

## డిశంబరు 5 వ తేదీన మదరాసు రాగలరు

చెన్నపట్నం, డిశంబరు 2: ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సందర్భమున ఆస్తి అప్పులు పంపకము, రాజధాని సమస్య మున్నగు వ్యవహారములను ఆంధ్ర నాయకులతోను తమిళ నాయకులతోను సంప్రతించుటకు గాను అ. భా. కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకట్రావు గారు డిశంబరు 5 వ తేదీ గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ లో మదరాసు వస్తున్నారు. వారు వచ్చిన తరువాత ఆంధ్ర మంత్రులను ఆంధ్ర నాయకులను కలుసుకుంటారు.

# నర్సారావుపేట తాలూకా ఎరుకల మహాసభ

సంతమాగులూరు, నవంబరు 29: నరస రావుపేట తాలూకా ఎరుకల మహాసభ ఆంధ్రరాష్ట్ర ఎరుకల మహాసంఘ ప్రధాన కార్యదర్శి రామేశ్వరం నాగయ్య అధ్యక్షత క్రింద సంతమాగులూరులో గత వారంలో జరిగింది. రాష్ట్ర ఎరుకల మహాసంఘ అర్గనైజరు షేన్నా కోటేశ్వరరావు గారు ప్రారంభించిరి.

ప్రస్తుతం అమలులోనున్న అలవాటు పడిన నేరసుల శాసనము ఇదివరకటి నేరపు జాతుల శాసనానికి ఆచరణలో ఏమాత్రము తీసిపోవుటలేదని ఈసభవారభిప్రాయపడుచూ, దీనిని రద్దు చేసి, ఎరుకలజాతికి పోలీసులవలన కలుగుచున్న ఘోర అన్యాయాన్ని రూపుమాపి జాత్యభివృద్ధికి దోహదమియాలని మదరాసు ప్రభుత్వము వారిని కోరుచు ఒక తీర్మానంచేశారు. ఎరుకల, యానాది, లంబాడి (సుగాల) కోయ, చెంచు, దొమ్మరి, పిచ్చికుంట్ల, పాముల, బుడబుక్కల మున్నగు ఆదిమ వాసులు ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా, వైజ్ఞానికంగా వెనుకబడియున్నారు. వీరిస్థితి బాగుపడాలంటే, ఏలాంటి మినహాయింపులు లేకుండా ఈ జాతులను షెడ్యూల్డు తరగతులలో చేర్చి, లేక షెడ్యూల్డుజాతుల సర్వసౌకర్యాల్ని కలుగజేసి ఈ జాతుల సంస్కరణకు దోహదమివ్వాలని వేరొక తీర్మానంచేశారు.

ఎరుకలవారు ఆర్థికంగా వెనుకబడియుండుటకు సేద్యమునకు భూములు, యిండ్లుకట్టుకొనుటకు నివేశనస్థలములు లేకపోవుటకూడా ఒకటని ఈ సభవారభిప్రాయపడుచూ, బంజరు, పోరంబోకు భూములను సేద్యమునకు, యిండ్లుకట్టుకొనుటకు నివేశనస్థలములు మంజూరు చేయాలని కోరారు.

తాలూకా సంఘానికి మొగిలి వీరయ్య అధ్యక్షుడుగను, మొగిలి వీరయ్య కార్యదర్శిగను ఎన్నుకోబడినారు.

## రాజోలు తాలూకా కౌలు రైతు మహాసభ

మోరి, నవంబరు 29: రాజోలు తాలూకా రైతుకాంగ్రెస్ అధ్యర్యాన మొన్న మధ్యాహ్నాం 1 గంటకు మలికిపురం సినిమాహాలులో తాలూకా కౌలు రైతుమహాసభ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యులైన రుద్రరాజు రామలింగరాజుగారి అధ్యక్షతను జరిగింది. తాలూకాలోని వివిధ గ్రామాలనుంచీ అనేక వందలమంది కౌలు రైతులు, కార్మికులు, కూలీలు, సమావేశంలో పాల్గొన్నారు. ప్రప్రథమంగా సమావేశ ప్రాధాన్యతను విశదీకరిస్తూ, రైతుకాంగ్రెసు కార్యదర్శి వంతులూరి గోపిచంద్ గారు మాట్లాడారు. అధ్యక్షులు తమ ఉపన్యాసంలో యీ తాలూకాకు మొన్నటి ప్రచండ తుపాను వల్ల దాపురించిన నష్టం, సముద్రంపొంగి పొలాలు, కొంపలు ముంచెత్తిన దురవసను విపులీకరించారు.

“తుపాను బాధితుల్లో మొట్టమొదట తెలుపవలసినవారు కేవలం కౌలురైతులే. వారి దురవస్థ దుర్భరమైంది. తుపానువల్ల పస్యాన్ని, పశువుల్ని; కొంపనీ కోల్పోయి, యిబ్బడిగా దెబ్బతిన్న కౌలురైతు జీవాన్ని నిలుపవలసిన బాధ్యతి ఉదారవంతులైన యీనాందార్లదే, కనికరంతో మక్తాలో నష్టానికి సరిపడే మొత్తాన్ని తగ్గించి మిగిలిన మొత్తాన్ని వసూలు చేయుడానికి అంగీకరించడం వారి కనీసధర్మ”మని రామలింగరాజుగారు పత్రికలకు తెలియచేశారు.

చివరికి మక్తామొత్తాలలో నూటికి నలభైబస్తాలు తగ్గించి అరవై బస్తాలవంతున (మక్తాలు) సేకరించవలసిందని తీర్మానము ప్రతిపాదించబడింది. సమావేశానికి హాజరైనవారంతా యీ నిర్ణయానికి హర్షించారు.

యీ పద్ధతిని మక్తా వసూళ్లు జరుగుతున్నవో లేదో, లేనిచోట్ల కార్యక్రమం కొనసాగించి అమలు జరిపించడం నిమిత్తం నేడు వస్తున్న రివిన్యూ మంత్రిగారితో యీ తాలూకా దురవస్థను వెల్లడిచేసి, స్థానికంగా వెంటనే కావలసిన సౌకర్యాలను నివేదిస్తూ మాట్లాడటానికి యీ క్రింది వారితో ఒక సంఘాన్ని నియమించారు. రుద్రరాజు రామలింగరాజు, నూరిశెట్టి వెంకటస్వామినాయుడు, మున్న నారాయణరావు, తెన్నాప్రగడ సూర్యప్రకాశరావు, గ్రంధి మూలాస్వామి, సైనాల సాంబశివరావు వాసంశెట్టి వెంకటరత్నం, సెన్నాత్స పద్రరాజుగార్లు. (స్వ. వి.)

## అమెరికాలో ఉదయశంకర్ నృత్య ప్రదర్శనములు

న్యూయార్కు, డిసెంబరు 1: శ్రీ ఉదయశంకర్, అతని నాట్యబృందము సెప్టెంబరు 27 తేదీన అమెరికాలో నృత్యప్రదర్శనములు ప్రారంభించెదరు. ఈ బృందములో 15 నర్తకులు గాయకులు కలరు వీరు నూరువారములపాటు ప్రదర్శనలు గావించెదరు.

# రెవెన్యూ మంత్రి పర్యటన

అమలాపురం, నవంబరు 30: మద్రాసు రెవిన్యూమంత్రి హెచ్. సీతారామరెడ్డిగారు నిన్న మధ్యాహ్నము 11 గంటలకు రాజోలునుంచి గన్నవరం వచ్చిరి. వారితో డి. బాలసుందరం, జిల్లాకలక్టరు, జిల్లాపోలీసు సూపరెంటెంటు, మల్లిపూడి పల్లంరాజు, ఎమ్. ఎల్. ఏ. కూడా వచ్చిరి. 12 గం. లకు గన్నవరం విశ్రాంతి భవనములో భోజనములుచేసి అమలాపురం బయలుదేరిరి. గన్నవరంలో రైతులు దాళవపంట నిమిత్తమై తగినంత నీరు, విత్తనములు సరఫరా చేయవలసినదిగా మంత్రిగారినికోరిరి. అమలాపురం వెళ్లు దారిలో ముంగండ గ్రామములో మంత్రిగారు బేసిక్ ట్రెయినింగు సెంటరును చూచిరి. సరిగా మధ్యాహ్నము రెండు గంటలకు మంత్రిగారు అమలాపురం చేరిరి. కోనసీమ కోపరేటివు సెంట్రలు బ్యాంకు, అమలాపురం భూమి తనఖా బ్యాంకువారలు మంత్రిగారికి తేనేటివిందు నిచ్చిరి. తదుపరి మంత్రిగారు ఎన్. రామభద్రిరాజు యం. యల్. సి. గారి నివాసస్థానమయిన కోదూరుపాడు వెళ్లిరి. కోదూరుపాడులో రామభద్రిరాజుగారు తేనేటి విందారగించిరి. మధ్యాహ్నము నాలుగు గంటలకు మంత్రిగారు సపరివారముగా చల్లపల్లి గ్రామము చూచుటకు వెళ్లిరి. ఈ గ్రామమునకు ఉప్పెన 12 అ. ఎత్తున వచ్చి సర్వనాశనము గావించి అక్కడి ప్రజలకు మూడు రోజులవరకు త్రాగుటకు నీరు కూడ లేకపోయినది. ఆ గ్రామరైతులు మంత్రిగారి కొక నివేదకను సమర్పించిరి. దానిలో ఉప్పెన వల్ల సముద్రము గండ్లుపడి దాని ప్రక్కలనున్న సుమారు 6000 ఎకరములు పంటకు యోగ్యమైన భూములలోనికి సముద్రపునీరు వచ్చుచుండుటచే తక్షణమే గండ్లుపూడ్చు ఏర్పాటుచేయవలెననియు, తరువాత రెండవపంటకు కావలసిననీరు, విత్తనములు యిప్పించవలెననియు, రైతులకు పెట్టుబడి నిమిత్తమై అప్పులు యిప్పించవలెననియు కోరారు. దానిమీద మంత్రిగారు సమాధానము చెప్పుచు జిల్లా వ్యవసాయశాఖ వారు విత్తనములు సరఫరా విషయమై చూచెదరనియు తదితర సంగతులు తాము ఆలోచించెదమనియు, చెప్పిరి.

సాయంకాలము ఆరుగంటలకు మంత్రిగారు, సపరివారంగా అమలాపురంవచ్చి తక్షణమే కోటిపల్లి బయలుదేరివెళ్లిరి. కోటిపల్లి రేవునద్ద లంకభూముల రైతులు జమీందారు పన్నుల వసూలు విషయములో తమకు కొంత వ్యవధి ఇప్పించవలసినదిగా నివేదించుకోగా ఆవిధముగా ధరఖాస్తువ్రాసి రెవిన్యూ అధికారులకు పెట్టుకున్నచో తాము చేయగలిగిన సహాయము చేసెదనని చెప్పిరి.

అనంతరం మంత్రిగారు పరివారము కోటిపల్లి వెళ్లిరి.

## శ్రీ గోపాలరెడ్డిగారి విశాఖపట్నం జిల్లా పర్యటన

మదరాసు, డిశంబరు 1: ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు 7 వ తేదీ నుండి 15 వరకు దిగువ కార్యక్రమము ననుసరించి పశ్చిమగోదావరి విశాఖపట్నం జిల్లాలలో పర్యటించెదరు.

7 వ తేదీ కలకత్తా మెయిలులో బయలుదేరి 8 తేదీన తాడేపల్లిగూడెం విమానాశ్రయం, ప్రత్యేక సాయుధ దళము తనిఖీ, తణుకు, నిడదవోలు, కడియం 9 వా తేదీ 9, 10 తేదీలలో వాల్తేరులో వుండెదరు. 10 సాయంత్రం బయలుదేరి 11 వ తేదీన ఇచ్ఛాపురం, రాజాపూర్, కలిటి, బోరివంక, మాణిక్యాపురం, తాళతంపర, సోంపేట, బారువ హరిపురం, పలాస,విజిరాపుకొట్టూరు, పాతపెక్కలి నౌపడా, టెక్కలి (రాత్రిబస) 12 తేదీ: మిలియాపుట్టి, పర్లాకిమిడి, నాతల, సర్వకోట, కోమటపల్లి, తిలారు, నరసన్నపేట, పోలాకి, కలింగపట్నం, శ్రీకూర్మము, శ్రీకాకుళము (రాత్రిమకాం) 13 తేదీ: దూసి, సిద్ధాంతం, లక్ష్మీనరసపేట, హీరమండలం, కొత్తూరు, బూర్జ, సంకిలి, పాలకొండ, ఆముదాలవలస(రాత్రిమకాం) 14 ఉదయం ఆముదాలవలస విడిచి 15 ఉదయం మదరాసు చేరెదరు.

### బూటకపు కంపెనీ నిర్వహించిన దంపతులకు శిక్ష

చెన్నపట్నం, నవంబరు 30: కే.యం. నాయర్, అతని భార్య లీలానాయర్ అనే వారు తంబుశెటి వీధిలో నొక బూటకపు కంపెనీ పేరుతో తాము బి యస్. ఏ. రాలీ బైసికిళ్లను తెప్పించి యిచ్చెదమని తెలిపి పలువురివద్దనుండి 1947 సం. మే, జూన్ మాసములలో రూ. 15000 వరకు పుచ్చుకొని మోసగించినారని వారిమీద తేబడిన అభియోగము రుజువుకాగా అయిదవ రాజధాని మేజిస్ట్రీటు శ్రీ కే. రాజగోపాలన్‌గారు మొదటి ముద్దాయి 18 నెలల కఠినశిక్ష, రూ. 1000 జరిమానా రెండవ ముద్దాయికి కోర్టుముగిసేవరకు శిక్ష నెయ్యి రూపాయలు జరిమానా విధించిరి.

# తాంబరం వైమానిక శిక్షణ కేంద్రం

## ఏయిర్‌మార్షల్ ఎల్మ్‌హర్స్టు తనిఖీ

చెన్నపట్నం, డిశంబరు 1: ఏయిర్ మార్షల్ ఎల్మ్‌హర్స్టుగారు భారత వైమానిక దళాధిపతి యీవాళ ఉదయం తాంబరం ఆర్. ఐ. ఏ. యఫ్. శిక్షణకేంద్రమును సందర్శించి వైమానికుల తర్ఫీదు ఏర్పాట్లను తనిఖీచేసిరి. ఎల్మ్‌హర్స్టుగారు సతీ సమేతముగా సరిగా ఉద 9 గంటలకు తాంబరం వైమానిక శిక్షణకేంద్రపు పరేడు స్థలమునకు విచ్చేసిరి. వారికి కెప్టెన్ ఆర్. రాజారామ్‌గారు తదితర ఆఫీసర్లు వైమానిక దళాధిపతికి స్వాగత మొసగిరి. అనంతరం ఏయిర్ మార్షల్ ఎల్మ్‌హర్స్టుగారు అచ్చట బారులు దీరి నిలిచియుండిన సుమారు 1500 మంది వైమానిక బృందమును దళమువారిగా తనిఖీ చేసిరి. తరువాత వైమానిక దళములు దళాధిపతిని సైనికాచారము ప్రకారం నమస్కరించుచు వారి ముందు వరుసగా వెళ్లగా ఆయన వందనములు గైకొనెను. ఈ వందన విన్యాసము అయిన మీదట ఎల్మ్‌హర్స్టుగారు వైమానికులు ప్రదర్శించిన క్రమశిక్షణ నేర్పు మెచ్చుకొనుచూ సైన్యములోనివారు ఐక్యతతో క్రమశిక్షణకు బద్ధులుగా నుండునట్లుచేయుటకు యిట్టి పరేడులు ఆవశ్యకమనియు వైమానిక దళములో చేరినవారు నేర్పుతో తమ ధర్మములను నిర్వర్తించుట అవసరమనియు ఉద్బోధించిరి.

తరువాత వైమానిక దళాధిపతి, వైమానిక శిక్షణస్థలములు, భోజనశాలలు వైమానిక ఇంజనులు యితర వస్తుసామగ్రి శాలలు మున్నగువాటిని తనిఖీచేసిరి.

శ్రీమతి లేడీ ఎల్మ్‌హర్స్టుగారు కేంద్రమునకు చెందిన కిండర్ గార్డన్ స్కూలు పిల్లలశిక్షణ స్థలములు వైమానికుల కుటుంబాల నివాసస్థలములు వారలకు ప్రసూతి వైద్యసహాయములకు నుండే వసతులు మున్నగువాటిని సందర్శించిరి.

ఈ వైమానిక శిక్షణకేంద్రములో ఆర్. ఐ. ఏ. యఫ్. విమానాలు నడిపే వైమానికులే గాకుండా వైమానిక కేంద్రమున జరిగే పలు వ్యవహారములను నిర్వర్తించగల ఇంజనీర్లు మెకానిక్కులు, యితర కార్యకర్తలకుకూడా తర్ఫీదు ఒసగబడుచున్నది.

ఇక్కడ శిక్షణనుబడయువారికి ఉచితముగా తర్ఫీదు నివ్వడమేగాకుండా వారికి జీతము ఉచితముగా భోజనము నివాసము దుస్తులు సౌకర్యములు కలుగజేయబడుచున్నది.

విద్యావంతులును ఉత్సాహవంతులును అనుమన దేశపు యువకులను ఆర్. ఐ. ఏ. యఫ్. మంచి ఉద్యోగావకాశము కల్పించుచున్నది. అందులో చేరదలచేవారు దారుఢ్యవంతులై మెట్రిక్యులేషను తరగతివరకు చదివి యుండవలెను.

## అమెరికన్ పత్రికా రచయిత లిప్మన్ ప్రసంగం

మద్రాసు, డిసెంబరు 1: ప్రఖ్యాత అమెరికన్ పత్రికా రచయిత వాల్టర్ లిప్మన్ నిన్న నిక్కడ క్రైస్తవ యువ మహిళా మంటలి సమావేశంలో ఉపన్యసిస్తూ, అమెరికాలో గాంధీజీ అంటే అపారమైన భక్తి ప్రపత్తులు ఉన్నవనే, ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ అమెరికాకు వచ్చినపుడు ఒకదేశ ప్రధానమంత్రి వచ్చినట్లుగాగాక గాంధీజీ ప్రతిబింబం వచ్చినట్లు తోచిందని చెప్పెను. “యుద్ధానంతరం అమెరికాకు అనేకదేశాల ప్రధానమంత్రులు పర్యటనార్థం వచ్చారు. కాని ఏదేశ ప్రధానమంత్రి పండిట్ నెహ్రూకు గీటురాలేదు.

అమెరికా విప్లవంలోంచి ఉద్భతమైన దేశమే కాబట్టి భారతదేశ స్వాతంత్ర్యోద్యమంమీద మొదట్నుంచీ సానుభూతి ప్రదర్శిస్తూ వచ్చింది. ఇండియా స్వాతంత్ర్యం ఆసియాకేగాక యావత్ప్రపంచానికీ ప్రాధాన్యం వహించే సంఘటన.”

అమెరికాకు సామ్రాజ్యకాంక్ష, ఏకోశానా లేదని ఆయన నొక్కి చెప్పెను. కమ్యూనిస్టు చైనాను కామన్వెల్తు దేశాలు గుర్తించిన తర్వాత అమెరికాకూడా గుర్తిస్తుందని లిప్మన్ అనెను.

## ఫిర్కా అభివృద్ధి కార్యక్రమము

మదరాసు, డిశంబర్ 1: గ్రామోద్ధరణ మంత్రి శ్రీ బి. పరమేశ్వరన్ నేడు విలేఖరులతో మాట్లాడుచూ జిల్లాకు మరి 2 ఫిర్కాలలో అభివృద్ధి కార్యక్రమము అమలుజరుపుచు త్వరలో వుత్తర్వులు జారీ యగునని తెలిపిరి. ప్రస్తుతం ప్రతిజిల్లాలో ఒక ఫిర్కాలో అభివృద్ధి కార్యక్రమము జరుగుచున్నది. ఇదిగాక కేంద్రీకృత ఖద్దరు పథకము కొన్ని జిల్లాలలోని ఫిర్కాలలో అమలు జరుగుచున్నది.

త్వరలో అభివృద్ధి కార్యక్రమము అమలుజరుగు ఫిర్కాలు సుమారు 50 వుండుననియు, సిబ్బంది నిర్ణయము జరిగిన వెంటనే గృహనిర్మాణము నిమిత్తము లాండ్ ఎక్విజిషన్ పని ప్రారంభమవుతుందని గ్రామోద్ధరణ మంత్రిగారనిరి.

# మదరాసు వార్తలు

### భగవద్గీతోపన్యాసాలు

శ్రీ పురాణం లక్ష్మీపతి శర్మగారు (ఇంగుహూరు) తెలుగులో భగవద్గీతోపన్యాసములు తత్వార్థ సహితంగా 1 తేది నుండి 20 తేది వరకు ప్రతిరోజు సా 6 గ. శ్రీ రామకృష్ణ చైతన్య మండలి నెం. 31 రెడ్డిరాముని వీధియందు సాహుకారు పేటలో జరుగును.

### తిరుపతికి బస్సులు

మదరాసు ప్రభుత్వ బస్సులు (నెం 104) డిశంబరు 1 నుండి మదరాసునుండి నాగలాపురం మీదుగా తిరుపతి వెళ్లును.

### ఇంటికి పోతూంటే దొంగలు

శ్రీనివాసాచారి అను విల్లివాకం నివాసి (23 సం) నిన్న సాయంకాలం అవడి రోడులో ఇంటికిపోతూవుండగ, వినావరం వద్ద ముసుగు వచ్చి కాళ్లు చేతులు కట్టి రూ 6, ఉంగరం దొంగిలించి పారిపోయిరి.

మదరాసులో డిశంబరు 1 తేది నుండి కిరసనాయిలు రేషను వారమున కొకసారి కాక పక్షమున కొకసారి యిత్తురు. సీసా 0-3-6.

పాపాతి అమ్మాళు, రామస్వామి అను చాకలిపేట నివాసులు చైనాబజారులో వెండివస్తువులు అమ్ముచుండగ పోలీసులు అరెస్టుచేసిరి. దేవాలయ అర్చకుని ఇంటి చోరీకి సంబంధించిన వస్తువులు అవని తెలిసెను.

‘గాంధినగరు’ (అడయారు) డ్రెయినేజి స్కీమునకు రూ 3½ లక్షలు మదరాసు ప్రభుత్వంవారు ఖర్చు కార్పొరేషనుకి మంజూరు చేసిరి.

మదరాసు నగరంలో రోడ్ల ప్రక్కనున్న మోటారు టాక్సీ స్టాండులందుంచు అద్దె మోటారులకు దినమునకు 0-4-0 లేదా, నెలకు రూ 5 చొ॥ కార్పొరేషను వారు అద్దె పుచ్చుకొన దలచిరి. దీనివల్ల రూ 10,000 వసూలు కాగలదు. మోటారు స్టాండులు ఎక్కువ చేయుదలచిరి.

కీ॥ శే॥ టి. సుందరరావు నాయుడుగారి ఛాయా పటమును కోమలేశ్వరంపేట ప్రోగ్రెసివు యూనియను వారు కార్పొరేషనుకి బహూకరించిరి.

జార్జిటవును కృష్ణప్ప నాయక అగ్రహారము నందు మూడు యిండ్లు రూ 78000 లకు కొని ఒక మార్కెటు కట్టి, అందు కాయగూరలు, మాంసాదులు కూడ అమ్మించుటకు కార్పొరేషను వారు ఏర్పాటుచేయుచున్నారు.

## ఉద్యోగవార్తలు

మదరాసు, డిశంబర్ 1: ఈ దిగువ సూపర్‌వైజర్లు తాత్కాలికముగా అసిస్టెంటు ఇంజనీర్లుగా నియమించబడిరి. శ్రీ కె. గుండురావు, డి. కృష్ణమూర్తిరావు, పి. రామచంద్రరాజు, బి. సుబ్బారావు, టి. ఆర్. త్యాగరాజన్, కె. సుబ్బరామన్, యస్. రంగనాథన్, పి. వెంకటరత్నం, యస్. ఎ. వెంకటేశన్, ఆర్. రామచంద్రన్, హెచ్. శ్రీనివాసన్,ఆర్. యస్. బాలగోపాలన్, యస్. వి. రామానుజాచార్యులు, పి. తోయాజారావు, పి. వెంకటరమణయ్య, సి. రామచంద్రమూర్తి.



# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 4 ఆదివారం

## మద్రాసు (ఎ)

ఉ॥ 7-30 ఉదయసంగీతం (రి). 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 గానమంజరి (రి). మ॥ 1-0 వి. పద్మిని వి. హేమమాలిని. ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రాసహా. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం (రి). 3-0 టి. ఆర్. బాలసుబ్రహ్మణ్యం పాట. 4-0 మద్రాసు (బి)వలె. 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా॥ 5-30 తిరువేంద్రం కె. గణేశ్ పాట. 6-0 ఆంగ్లమునవార్తలు. 6-15 ఎ. వి. చెల్లమ్మాళ్ పాట. 6-45 మహారాజపురం వి. కోదండరామన్ పాట. 7-30 గీతమంజరి (రి). 7-45 మద్రాసు (బి) వలె. 8-0 ఎస్. ఎ. సుందరం పాట. 8-30 మద్రాసు (బి) వలె. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 యూనెస్కో వయోజనవిద్యాసభ ప్రసంగం. 9-30 ఎ. వి. నారాయణప్ప పాట. 9-45 పాశ్చాత్య సంగీతం (రి).

## మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగున వార్తలు. 7-15 శైశంసరస్వతి రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. మ॥ 1-0 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఆటవిడుపు నిర్వహణ. న్యాపతి రాఘవరావు. 3-0 మద్రాసు (ఎ) వలె. 4-0 కాదంబరి (రి). సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె. 6-15 సాయంసంగీతం (రి). 6-30 గ్రామసుల కార్యక్రమం. భామకలాపం బుర్రకథ. 7-0 తెలుగునవార్తలు. 7-15 ఊర్వశీ శాపము. హరివంశంనుండి పురాణకాలక్షేపం. 7-45 సర్వోదయలక్ష్ములసాధనలో ప్రసంగం. 8-0 మద్రాసు (ఎ) వలె. 8-30 వి. కె. వెంకటరామానుజం వయొలిన్. 9 మద్రాసు (ఎ) వలె. 9-45 శ్రోతలు కోరిన పాటలు రికార్డులు.

## విజయవాడ

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 చెంబై వైద్యనాథభాగవతార్ రికార్డులు. 7-30 యామర్తి వరలక్ష్మి, పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా. 8-30 స్వర్ణసీమ రికార్డులతో హరికథ. మ. 1 తారాపథం (రి.) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 4 పేరంటం; నృత్యకళావైచిత్రి, మన దక్షిణదేశపు నృత్యములు, మహాకావ్యములో మానవ ప్రకృతిచింత, రామాయణములో ప్రసంగం. సా. 5-30 టి. టి. సీత, పాట. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి (రి.) 6-30 గ్రామసుల కార్యక్రమం. (మద్రాసునుంచి.) 7-30 యామర్తి వరలక్ష్మి, పాట. 7-45 చిత్రవాణి (రి.) 8 ద్వారం వెంకటస్వామినాయుడు వయొలిన్, ఏల్చ సోమన్న, మృదంగం. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 మద్రాసు వలె. 9-30 టి. టి. సీత, పాట.

## హైద్రాబాదు

ఉ. 7-30 అన్వార్ హుస్సేన్ ఖాక్ ఖయాల్ రామ్‌కలీ. 8 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. ఢిల్లీ) 8-20 సంగీతపట్టం. 8-30 పుష్పవనం పాట. 8-50 తెలుగున వార్తలు. 9-15 సంయుక్తహరికర, భావగీత్. మ. 12-30 ప్రేమపూజార్ (రి.) 1 వి. నాగయ్య రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. ఢిల్లీ) సా. 5-0 అన్వార్ హుస్సేన్‌ఖాన్ ఖయాల్ పర్సీ 5-20 సంయుక్తహరికర భజన్, గీత 5-30 అన్వార్ హుస్సేన్ ఖాక్, ఖయాల్ బాబ్రా 6-30 మహిళామండలి తెలుగున, సౌందర్య పోషణ ‘దుస్తులు’ ప్రసంగం ఆర్. ఇందిర జయలక్ష్మియారం కర్నాటక సంగీతం 7-0 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. ఢిల్లీ) 7-15 గ్రామసుల కార్యక్రమం తెలుగున శాస్త్రీయ విజ్ఞానము (5) మన దేహము ప్రసంగం ‘వెట్టిఫీవర్ ప్రోగ్రాము 7-45 స్వాతంత్ర్యానంతరసంస్థానాలవిలీనీకరణ డా॥ ఎం. రామారావు తెలుగున ప్రసంగం 7-55 శంకరరావు వ్యాస్ 8-30 సంయుక్త హరికర గీత్ 8-45 అన్వార్ హుస్సేన్ ఖాన్ ఖయాల్ గౌరీ కల్యాణ్ 9-0 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. ఢిల్లీ) 9-55 పుష్పవనం కర్నాటక సంగీతం 10-25 ఓ. కప్పుస్వామి వయొలిన్ 10-35 పుష్పవనం కర్నాటక సంగీతం.

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 2:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నాం 1 గంటకు పవరను 1-కి ఎన్వర్డ కొత్త సేల్సుటాక్సుతోసహా రు. 77-0-0 పెట్టిబంగారు తులం 115-4-0 మూపబంగారు 113-0-0 సీమవెండి తులం 100-కి (రెడి) 172-0-0 వెండి తులం 1 కి 1-12-6

వేరుసెనగ: (581 పా 1-కి ఎన్ను కొప్పాగిడ్డంగులు) పెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొ త్తది. 159-0-0, (కోరమాండల్)

పేశానకగూడ మిస్సపెల్లర్ (వీవర్ రు. 384,385 8టు 5% యప్. యప్. ఎ., పెంకాయనూనె(87 పౌన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్విలాన్. రు. 35-8-9, 37-8-9

### ఆముదం

(నరసరావుపేట) రు. 250, 260
కాండి 500 పౌనులుగలది చిల్లరగా రు. 280 290

### పంచదార

| | | |
|---|---|---|
| నర్కటాగంజ (2అందరు) | | రు. 94-9-5 |
| హసన్‌పూర్ | ,, | రు. 93-14-0 |
| మోతీపూర్ | ,, | రు. 94-7-10 |
| చిల్లరధర | వీశ 1-కి | 1-5-3 |

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసంబరు 1:

డిసెంబరు వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | జల | 29.91 |
| నిన్న | | 29.91 |
| ,, ముగింపు | జల | 29.99 |
| నిన్న | | 29.97 |

# కాశ్మీర్ పోరాటంలో పాకిస్థాన్ చేజిక్కిన భారతీయ ఖైదీలు

## పార్లమెంటులో నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 1: స్వర్గూలో పాకిస్థానుకు లొంగిపోయిన భారత సైనిక దళము విషయమై డా॥ మన్‌మోహన్‌దాస్ అడిగిన ప్రశ్నకు ప్రధాని పండిత నెహ్రూ గారు సమాధానము చెప్పుచు యిట్లనెను:

"1948 సం॥ రం ఆగస్టులో మా సైన్యము లొంగిపోయిన తరువాత అచ్చట పట్టుకొనబడిన భారతసైనిక ఖైదీలను పాకిస్థాన్ అధికారులు అటక్ శిబిరమునకు మార్చిరి. 1949 సం॥ మే లో అంతర్జాతీయ రెడ్‌క్రాస్ ప్రతినిధియొకడు ఆ శిబిరమును దర్శించి, ఖైదీలు ఆరోగ్యము, స్థితి బాగుగా నున్నదని తెలిపెను. స్వర్గూ సైనికదళములో విస్తారభాగము కాశ్మీరు సంస్థాన సైనికులు, కొంతిమంది భారత సైనికులుగూడా కలరు. ఖైదీలను మార్చుకొనుటకు మేము మొదటినుండీ ప్రయత్నించుచున్నాము. మనకుచిక్కిన ఖైదీలందరిని పాకిస్థానుకు పంపివేసెదమని మేము చెప్పితిమి. మన ఖైదీలందరిని భారతదేశము పంపి వేయవలసినదని మేము కోరితిమి. ఒకానొక సమయమున ఆ విధముగాచేయ పాకిస్థాను ప్రభుత్వము సిద్ధముగా నుండెను. కాని తరువాత వారు సంఖ్యనుబట్టి మార్పిడీజరుగవలెనని,వారు చెప్పిరి. అనగా వారు ఒక భారత ఖైదీని విడుదలచేసినయెడల మనము వారి ఖైదీనొకనిని విడుదల చేయవలెనని చెప్పిరి. రాయబారములు, భగ్నమయ్యెను. ఈరాయబారముల నింకనూసాగించుచున్నాము. ఈ సైనికదళము మాత్రమేగాక (స్వర్గూ సైనికదళము) పాకిస్థానువారు తీసికొనిపోయి ఏదోవిధమైన ఇంటరన్‌మెంటులో నుంచిన స్వర్గూ పౌరులు 200 మంది కలరు. ఈ సివిలియనులను ఒక మాసము క్రిందట పాకిస్థాన్ అధికారులు పెషావరు తీసికొని వెళ్ళిరి. వారిని విడుదల చేయవలెనని భారత, ప్రభుత్వము విజ్ఞాపనలు గావించుచున్నాడు. కాని ఈ విజ్ఞాపనలకు సమాధానమేమియూ లేదు. కాశ్మీరు యుద్ధములో పాకిస్థాన్ ఖైదుచేసిన భారత సైనికుల సంఖ్య 692. వీరిలో 45 గురు భారత సైన్యమునకు చెందినవారు. 647 జమ్మూ కాశ్మీరు సంస్థాన సైనికులు భారత దళములలో పాకిస్థాను సైన్యమునకు చెందిన ఖైదీలు 9. ఇతర దళముల వారు 115.

# కాశ్మీర్లో పాకిస్థాన్ యుద్ధ నియమోల్లంఘన

## పార్లమెంటులో నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 1: "1949 సం॥ మొదటి అర్ధభాగమంతటా కాశ్మీరు రంగంలో పాకిస్థాన్ అనేకపార్లు యుద్ధ విరమణ నియమాలను తీవ్రంగా ఉల్లంఘించింది. కాని జులైలో యుద్ధ విరమణ ఒడంబడికపై సంతకాలు పెట్టటం జరిగిన తరవాత హద్దుపొడుగునా మాత్రమే ఒడంబడిక ఉల్లంఘించబడదికాని ఆ ఉల్లంఘన లంత తీవ్రమైనవి కావు. అవి మంచిగానే సర్దుబాటు అయినవి. అని భారత ప్రధాని పండిత నెహ్రూ నేడు పార్లమెంటులో ఒక ప్రశ్నకు జవాబిస్తూ సెలవిచ్చారు.

"తీవ్ర ఉల్లంఘనలు జరిగి నప్పుడు సరిహద్దుల్లో నివసించే ప్రజలు చాలా బాధించబడ్డారు. తగాదాలను సర్దుబాటు చేసుకొనటంలో సమితి పరిశీలకులు తోడ్పడ్డారు." అని ఆయన వివరించాడు.

# జమ్మూ, శ్రీనగర్ మునిసిపల్ ఎన్నికలు

## అబ్దుల్లా ప్రకటన

జమ్మూ, డిసెంబరు 1: వయోజన వోటింగ్ పద్ధతిని, త్వరలో జమ్మూ, శ్రీనగర్ మునిసిపల్ ఎన్నికలు యేర్పాటు కాబోతున్నవనీ, ఓటర్లజాబితాలు తయారు చేయించుచున్నామనీ, కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా ఈ వేళ జమ్మూలో ప్రకటించారు.

ఢిల్లీనుండి నా లేక్‌సక్సెస్ వెళ్ళటానికి కాశ్మీర్ ప్రధాని బయలుదేరుతున్న సందర్భంలో జమ్మూ కార్పొరేషన్‌వారు ఇచ్చినవిడోల్కోలు పత్రానికి సమాధానమిస్తూ ఇలా తెలియజేశారు.

"పాకిస్థాన్, కాశ్మీర్‌తో ఆవకేవో బాంధవ్యమున్నట్లు పదే పదే వాపోతూవుంటుంది. ఇవంతా నేతిబీరకాయ రకం మాటలు. పాకిస్థానుకు కాశ్మీర్‌తో బాంధవ్య మక్కర్లేదు. కాశ్మీర్‌లో వున్న బౌంధవ్యాన్ని, ధనాన్ని స్వాధీనం చేసుకోవాలని చూస్తున్నది పాకిస్థాన్ మతతో న్మాద విధానానికి, కాశ్మీర్ సౌదర్య సిద్ధాంతానికి రాజీ అంటూ యేలోకానా కుదరదు" అన్నారు.

అనంతరం జరిగిన బహిరంగసభలో, ప్రధాని ఇలా అన్నారు:

"సంస్థానాధీశ్వత్వకారకు అనేక ప్రాజెక్టుల నిర్మాణాన్ని గురించి ప్రభుత్వం ఆలోచించుచున్నది. ప్రజలమున్నామూ, ప్రభుత్వం ఇనే విధమైన సమాకారం ప్రబలిపుంటే నవకాశ్మీర నిర్మాణాన్ని స్వల్పకాలంలో సాధించగలం" అన్నారు.

# చంద్రనగర్ అప్పగింత

## 'ఇండియా ఫ్రాన్సుల మధ్య ఒప్పందం అవసరం'

### కెస్కార్ వివరణ

న్యూఢిల్లీ, డిశంబరు 1:

ఫ్రెంచి రాజ్యాంగచట్టం ప్రకారం ఫ్రెంచి భారత ప్రభుత్వములు రెండూ ఒడంబడిక చేసుకొని దానిపై సంతకములు పెట్టిన తరువాతనే చంద్రనగర్, భారత యూనియన్‌లో చేర్చబడునని, విదేశాంగ శాఖ సహాయమంత్రి డా॥ కేస్కార్ యీ వేళ పార్లమెంటులో సిధ్వా ప్రశ్నకు సమాధానముగా తెలియజేశారు.

ఈ ఒడంబడిక ముసాయిదా త్వరలో ఫ్రెంచిప్రభుత్వం భారత ప్రభుత్వానికి పంపవచ్చును."

సిధ్వా: చంద్రనగర్ ప్రజలు భారత యూనియన్‌లో చేరెదమని జనవాక్య నిర్ధారణద్వారా స్పష్టీకరించినప్పుడు యింకా అభ్యంతర మేమిటి?

కేస్కార్: ఇంకొక పరిష్కృతం కావలసిన రాజ్యాంగచట్ట సంబంధ విషయాలు కొన్ని ఉన్నవి. అవే అభ్యంతరం. ఈ అభ్యంతరాలను వీలైనంత త్వరలో తొలగించుటకు ప్రయత్నిస్తున్నాము.

పాండిచేరిలో కాన్సల్‌నుగాని వైస్ కాన్సల్‌నుగాని నియమించకుండా కాన్సల్ జనరల్‌ను నియమించటంద్వారా భారతప్రభుత్వం ఫ్రెంచిఇండియా స్థావరాల హోదాను పెంచడం కాదా అని కామత్ ప్రశ్నించాడు.

ఈ ప్రశ్న తోసివేయబడినది.

# వ్యవసాయకూలీల సంఘటనోద్యమం

## హింద్ మజ్దూర్ సేవకసంఘ నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబరు 30: గ్రామాల్లో నివసించే వ్యవసాయకూలీలను సంఘటితపరిచే నిమిత్తం 200 మంది సభ్యులకు ప్రత్యేక శిక్షణ నివ్వాలని 'హిందూస్థాన్ మజ్దూర్ సేవకసంఘ కార్యవర్గం నేడిచ్చట సర్దార్ పటేల్ అధ్యక్షతన సమావేశమై తీర్మానించింది. భారత ప్రభుత్వ కార్మికమంత్రి జగ్జీవన్‌రాం, బొంబాయి కార్మికమంత్రి నందా, కాంగ్రెస్ కార్యదర్శి శంకర్రావ్ దేవ్, జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడు ఖండూభాయ్ దేశాయ్ మొదలైన ప్రముఖులు సమావేశానికి హాజరైనారు.

గాంధీజీ సిద్ధాంతాలను కార్మికులలో ప్రచారంచేసే సేవకులను పోషించటానికిగాను 'కార్మికోద్యమ నిర్మాణకృషి నిధి' పేరుతో విరాళాలను సేకరించాలని కూడా కార్యవర్గం తీర్మానించింది.

# రైల్వే ఉద్యోగుల ఆహార పదార్థాల కల్తీ

న్యూఢిల్లీ, నవంబరు 30: 'రైల్వే ఉద్యోగులకు సప్లయి చేసిన ఆహార పదార్థాలు' కల్తీ చేసినట్టు 1948-49 లో 58 తేనియోగాలు వచ్చినవి. వీటిలో 25 కేసులు విచారణకు పెట్టాం. రైల్వే వారికిచ్చే ఆహారపదార్థాలు దేశంలో లభించుతున్న నాటికంటే మరేం నాసిరకం కాదు.' అని సరఫరాశాఖ మంత్రి సంతానంగారు పార్లమెంటులో ప్రకటించారు.

# కాంగ్రెసు సభ్యత్వం

## కళా వెంకట్రావుగారి ప్రకటన

పాట్నా, నవంబరు 30: కాంగ్రెసు ప్రధాన కార్యదర్శియగు కళా వెంకట్రావుగారు యీ క్రిందివిధిగా రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీలకన్నింటికిని ఒక యాదాస్తును పంపిరి.

కాంగ్రెసులో యోగ్యతగల సభ్యులను చేర్చుటకు 30-11-49 తేదీవరకు యివ్వబడిన గడువు ఇప్పుడు 15-12-49 తేదీ వరకు పొడిగింపబడినది.

యోగ్యతగల కాంగ్రెసు సభ్యులను నిర్మాణాత్మక సమర్థులైన సభ్యులుగా చేర్చుటకు 15-1-1950 తేదీవరకు ఆఖరు గడువు నిర్ణయింపబడెను. గ్రామపంచాయితీలకు ఎన్నికలను పూర్తి చేయవలసిన గడువు 31-12-49 నుండి 1950 జనవరివరకు పొడిగింపబడెను.

# రాష్ట్రపతి బీహార్ పర్యటనము

పాట్నా, డిసెంబరు 1: కాంగ్రెస్ మహాసభాధ్యక్షులగు డా॥ పట్టాభిసీతారామయ్యగారు డిసెంబరు 3 తేదీ నుండి నాల్గురోజులు బీహారులో పర్యటింతురు. డిసెంబరు 3 తేదీన రాష్ట్రపతి ఛాప్రాలో డా॥ రాజేంద్రప్రసాద్ 65 జన్మదినోత్సములలో నధ్యక్షత వహించి డిసెంబరు 4న పాట్నా వచ్చెదరు. డిసెంబరు 5న వారు భాగల్‌పూరు వెళ్ళెదరు. అచ్చటి నుండి 6 తేదీ రాంచీ వెళ్ళెదరు.

# రాష్ట్ర ఆహార పరిస్థితి

మదరాసు, డిశంబరు 1: ఇండియా ప్రభుత్వము డిశెంబరు నెలకు మదరాసుకు 24 వేల టన్నుల బియ్యము కేటాయించినది. ఈ విషయమును నేడు విలేఖరులకు తెలుపుతూ మదరాసు ప్రభుత్వఆహారశాఖ కార్యదర్శిగారీ ఈ సరకు మింజుమలె యు. పి. నుండి 6 వేలటన్నులు, కొచిన్ అవడిలోని ఇండియా ప్రభుత్వ గిడ్డంగులనుండి 9 వేల టన్నులు, విదేశములనుండి 9 వేల టన్నులు రాగలవనిరి. ఇదీగాక గడచిన ఖరీఫ్ సంవత్సరం తాలూకు కోటానుండి ఇంకనూ 5 లేక 6 వేల టన్నులు బాకీ వున్నదనియు ఈసరకు ఒరిస్సా వింధ్య ప్రదేశములనుండి రావలెననిరి.

ఆంధ్రజిల్లాలలో తుపానువలన షుమారు 3 లక్షల టన్నుల నష్ట ముండుననియు, మామూలుగా ఇండియా ప్రభుత్వము వారిచ్చు కోటాలకు అదనముగా 3 లక్షల టన్నులను మంజూరు చేయవలసినదని మదరాసు ప్రభుత్వము ఇండియా ప్రభుత్వమును కోరియున్నదనికూడ ఆహార కార్యదర్శి తెలిపిరి.

నవంబరు 29 తో అంతమైన వారమున 185318 టన్నుల బియ్యము, 3-800 టన్నుల గోధుములు, 12616 ట. మైదా 58546 ట జొన్నలు 716 టన్నుల సెమోలినా మొక్క జొన్నలు 44 టన్నులు మొత్తము 2,89,040 టన్నుల ఆహార ధాన్యము లున్నవనియు, బియ్యం 6 వారములకు, జొన్నలు 12 వారములకు, గోధుములు 18 వారములకు, మైదా 6 నెలలకు సరిపోవుననికూడా ఆహార కార్యదర్శి తెలిపిరి.

# కార్పొరేషను ఎన్నిక

శ్రీ. వి. ఎ. మూర్తిగారు చింతాద్రిపేట డివిజను నుండి కార్పొరేషను సభ్యునిగ ఎన్నుకొనబడిరి. వీరికి 470 వోట్లు వచ్చినవి ప్రత్యర్థులుగ నిలచిన టి. జి. లక్ష్మణస్వామి గారికి 421, ఎల్, వేణుగోపాల నాయుడుకి 571 ఎ. కృష్ణస్వామి మేస్త్రికి 297, వచ్చినవి.

మూర్తిగారి లోగడ ఎన్నిక ప్రభుత్వం రద్దు చేసినందున యీ ఉపఎన్నిక జరిగి తిరిగి వారే ఎన్నుకొనబడిరి.

# పంటలబీమాపథకము

మదరాసు, డిశెంబరు 1: కొంతకాలము నుండి ప్రభుత్వము పరిశీలించుచున్న పంటల భీమాపథకములో రాష్ట్రము లోని అభ్యుదయ రైతుల సూచనలు, సలహాలకు అనుగుణ్యముగా కొన్ని సంస్కరణలు చేయబడినవని మదరాసు ప్రభుత్వ ఆర్థిక సలహాదారుడు డాక్టర్ బి. నటరాజన్ నేడు విలేఖరులతో చెప్పిరి.

పథకములో రెండు మార్పులు ముఖ్యమైనవి. వాతావరణపరిస్థితులనుబట్టి రాష్ట్రమును నాలుగు ప్రాంతములుగా విభజించుట ఒకటి, ప్రీమియము వృద్ధిలో 1/2 వంతుగాక అంతకన్న తక్కువగా యుండుట రెండవమార్పు.

ఆర్థిక సలహాదారుడు మొదట తయారుచేసిన పథకము అభిప్రాయములకు మొత్తము రాష్ట్రములోని అభ్యుదయ రైతులకు పంపిరి. వారిసలహాలు సూచనల ననుసరించి డాక్టర్ నటరాజన్ పైన తెలిపిన సవరణలు కొన్ని చేసిరి. ఇండియా ప్రభుత్వము సూచించినట్లు ఏమూనా పథకమునకు డాక్టర్ నటరాజన్ ముఖ్యముగా నేరు బాధ్యత వహించు పక్షమున అమలుజరిపిననే ఈ పథకము జయప్రదముగా జరుగగలదని వారనిరి.

# 'భారత స్వాతంత్ర్యాన్ని సంఘటితపరచడంలో సహాయపడండి'

## హైదరాబాద్ ప్రజలకు మేజర్ జనరల్ చౌధరి వీడ్కోలు సందేశం

హైదరాబాద్, డిసెంబరు 1:— హైదరాబాద్ మిలిటరీ గవర్నరు పదవినుండి విరమిస్తున్న మేజర్ జనరల్ చౌదరి గారు గతిరాత్రి హైదరాబాద్ రేడియోలో సంస్థాన ప్రజలకు వీడ్కోలు సందేశమిస్తూ, హైదరాబాద్ యిప్పుడు భారత సమాఖ్యలో చేరిందనీ, దీని హైదరాబాద్ రాజ్యాంగ పరిషత్తు తర్వాత స్వపర్చవలసి యున్నదని అన్నాడు.

"రాజ్యాంగ పరిషత్తుకు త్వరలో ఎన్నికలు జరుగనున్నవి. హైదరాబాద్ యిక భారత రిపబ్లిక్‌లో తన సముచిత స్థానాన్ని పొందగలదు. మన మంతా ఎల్లప్పుడూ ఒకే ప్రజమనం ఐకమత్యంతో యింకా బలపడవలసియున్నది. భారత రిపబ్లిక్ అతియ పురోభివృద్ధికి స్వాతంత్ర్యాను సుస్థిరం చేయుటలో మీరు తమపాత్ర నిర్వహించగలరని ఆశిస్తున్నాను." అని చౌధరిగారన్నారు.

ప్రసంగంలో తాను రేపు మిలిటరీ గవర్నరు పదవినుండి విరమిస్తున్నాననీ, యిక నుండి సంస్థాన పరిపాలనాధికారిగా వెల్లోడీగారుంటారనీ చెప్పారు. పోలీసు చర్య అనంతరం మొట్టమొదటిసారి 1948 సెప్టెంబరు 18 న తాను హైదరాబాద్ రేడియోలో ప్రసంగించుటను ప్రస్తావించి, అప్పుడు తాను ఇండియా మత సంపర్కరహిత రాజ్యమనీ, దాని ప్రతినిధిగా తన ప్రభుత్వము అదే ఆశయంతో పనిచేయుననీ, చెప్పినానని వివరించారు. సంస్థానంలో శాంతిభద్రతలను నెలకొల్పుటలో తనతో సహకరించిన వారందరికి కృతజ్ఞత తెలియజేశారు. ఇటువంటి సహకారమునే వెల్లోడీగారికి కూడ యివ్వగలరని నమ్ముతున్నా నన్నారు. వెల్లోడీగారు పరిపాలనా విషయాలలో విశేషానుభవం కలవారనీ, కేంద్ర ప్రభుత్వ సంస్థానశాఖ కార్యదర్శిగా ఉన్న కాలంలో హైదరాబాద్ విషయాలను ఆయన సంపూర్ణంగా అవగతం చేసుకొన్నారనీ అన్నారు.

చౌధరిగారు తన ప్రసంగమును ముగిస్తూ తనతో అన్నివిధాలా సహకరించిన ఆఫీసర్లకు కృతజ్ఞత తెలిపారు. మిలిటరీ గవర్నరుగా తాను నిర్వహించిన కార్యభారం యోగ్యులు, సమర్థులుఅయిన వారిచేతుల్లోకి వెడుతున్నందుకు తృప్తిని వెల్లడించారు.

భవిష్యత్ జయాపజయాలు ప్రజల చేతలమీద నడతలమీద ఆధారపడియుంటాయన్నారు.

# జనరల్ చౌధరికి న్యాయకోవిద గౌరవ బిరుదం

## ఉస్మానియా విశ్వవిద్యాలయ సమర్పణ

సికందరాబాద్, డిశంబర్ 1: హైదరాబాద్ మిలిటరీ గవర్నరు పదవినుండి విరమిస్తున్న మేజర్ జనరల్ చౌదరిగారికి నేడు ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రత్యేకస్నాతకోత్సవ సభలో న్యాయకోవిద అని గౌరవబిరుదమిప్పించబడింది. ఈ సందర్భంలో చౌదరీగారు ప్రసంగిస్తూ విద్యాభ్యాసానికి కాక, యువకులు, యువతులు తమ వ్యక్తిత్వాన్ని రూపొందించుకొనుటకు అవకాశాలు కలుగజేయ్యాలని అన్నారు. తాను యితర అభివృద్ధి చెందిన దేశాల విశ్వవిద్యాలయాలు దర్శించినప్పుడు, అక్కడి విద్యార్థులు, అతి చురుకుగా ఉండటాన్ని చూశాననీ, భవిష్యత్ నాయకత్వానికి వారు తగునట్లుగా విశ్వవిద్యాలయంలో విద్య గరపబడుతున్నదనీ అది చూసిన తర్వాతనే మన దేశంలో కూడ విద్యాభ్యాసానికే గాక, యువతులు, యువకులు తమ వ్యక్తిత్వాన్ని రూపొందించుకొనుటకు తగిన అవకాశాలుండాలని అభిప్రాయపడినాననీ అన్నారు. విశ్వవిద్యాలయ అభివృద్ధికి దాని అధికార్లు యింతవరకు చేసిన కృషిని ప్రశంసించి, భవిష్యత్తులో, కూడ యీ అభివృద్ధి ప్రయత్నములను ఏమరకుండా సాగించి ఉస్మానియా విశ్వవిద్యాలయమును ఉత్తమశ్రేణికి చెందిన విద్యాలయంగా చేయగలరని ఆశిస్తున్నానన్నారు.

విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు నవాబ్ అలీయావర్‌జంగ్ బహదూర్ చౌదరిగారికి న్యాయకోవిద గౌరవ బిరుదము సమర్పిస్తూ పరిపాలకుడుగా ఆయన శక్తి సామర్థ్యాలను ప్రశంసించారు.

# తుళ్ళూరుపై కమ్యూనిస్టుల దాడి

## ముగ్గురికి తీవ్రంగా దెబ్బలు

విజయవాడ, డిశంబర్ 1: నవంబర్ 23 తేదీ ఉదయం, దాదాపు 30 మంది సాయుధ కమ్యూనిస్టులు, గుంటూరు తాలూకా కొంగనితుళ్ళూరు గ్రామముపై దాడిచేసి, గ్రామ కాంగ్రెసు అధ్యక్షుడు కొలి సుబ్బారావును, పువ్వాడ చినరామయ్యను గరిమెళ్ల సుబ్బయ్యను ప్రమాదకరముగా కొట్టిరని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయమువారు తెల్పుచున్నారు. దెబ్బలు తినిన మైవురును, ప్రస్తుతము గుంటూరు జనరల్ హాస్పిటల్ లో చికిత్స పొందుచున్నారు.

# పెట్రోలియమ్ వినియోగం

న్యూఢిల్లీ, నవంబరు 30: 1949 సం॥ సెప్టెంబరు 30 తేదీతో అంతమగు 18మాసములలో భారతదేశములో పెట్రోలియము పెట్రోలియముకుండి తయారగు వస్తువుల వినియోగము చాలా హెచ్చినదని మంత్రి గాడ్గిల్ గారు భారత శాసనసభలో ఒక ప్రశ్నకు వ్రాతపూర్వకముగా సమాధానమిచ్చుచు చెప్పిరి. 1949 సం॥ సెప్టెంబరు 30 తేదీతో అంతమగు ఆర్థికసంవత్సరములో 12,56,358 టన్నులు, అంతకుపూర్వ ఆర్థిక సంవత్సరములో 11,24 565 టన్నులు, అంతకుపూర్వ ఆర్థిక సంవత్సరము లో 9,42 822 టన్నులు వినియోగము య్యెనని ఆయన చెప్పెను.

# పార్లమెంటులో : హిందూ ధర్మశాస్త్ర సవరణబిల్లు

న్యూఢిల్లీ, నవంబర్ 30: రాష్ట్ర శాసనసభలలోకూడా సభ్యత్వం ఉన్న కేంద్ర శాసనసభ సభ్యులు, హిందూ న్యాయశాస్త్ర సవరణబిల్లుపై జరిగే చర్చలో పాల్గొనటానికి అనుమతించబడతారని తెలుస్తున్నది. ద్వంద్వ సభ్యత్వాన్ని రద్దుచేస్తూ ఎసెంబ్లీ కాంగ్రెస్ పార్టీ తాను లోగడ చేసిన నిర్ణయాన్ని తాత్కాలికంగా అనుసరించకుండుటకు నిశ్చయించినట్లు తెలుస్తున్నది.

# ఢిల్లీలో ఫెడరల్‌కోర్టు స్థాపన

న్యూఢిల్లీ, నవంబర్ 30: ఫెడరల్ కోర్టును ఢిల్లీలో వుంచటానికే ప్రభుత్వం నిర్ణయించింది. అయితే దీన్ని ప్రస్తుతం వున్న శాసనసభాభవనాల్లోనే వుంచటమా లేక మరొకభవనంలోకి మార్చటమా అనే విషయం ఇంకా ఆలోచనలోవుంది. ప్రస్తుతమున్న ధనాభావంతో ఈ విషయాన్ని ఇంకా కొంత ఆలోచించి నిర్ణయించవలసి వుంటుంది, అని సత్యనారాయణ సిన్హా యీ వేళ పార్లమెంటులో ప్రకటించారు.

# కృష్ణాజిల్లా సరిహద్దులలో కమ్యూనిస్టుల చర్యలు

## రాష్ట్రప్రభుత్వాధికారుల జాగరూకత

విజయవాడ, డిసెంబరు 1: కృష్ణాజిల్లా హైదరాబాదు సరిహద్దు ప్రాంతములలో ఈ మధ్య కమ్యూనిస్టులు చెలరేగినట్లు వార్తలు వస్తున్నవి. వీరు విశాలాంధ్ర అను ఒక తెలుగు సైక్లోస్టైల్ పత్రికను నడుపుచున్నట్లు తెలియుచున్నది. ప్రభుత్వమునకు వ్యతిరేకముగా వ్రాయుటయే ఈ పత్రిక యొక్క పరమోద్దేశ్యమని వేరుగా చెప్పనక్కరలేదు. కాంగ్రెసు నాయకుల మధ్యగల విభేదములు కమ్యూనిస్టు పార్టీ పెరుగుదలకు ఎట్లుపకరించ గలవో ఈ పత్రికలో వివరముగా వ్రాయు చుండుటగమనార్హము. ఈ విభేదముల నేదియో యొక విధముగా సజీవముగా నుంచుట— వీలైనప్పుడు ఈ విభేదములను పెంపొందింపజేయుట కమ్యూనిస్టు కార్యక్రమములో ప్రధానాంశముగా, ఈ పత్రికలోను తమ యితరకర పత్రములలోను వ్రాయుచున్నారట.

ఈ మధ్యకోదాడు పోలీసు స్టేషన్‌పై సాయుధ కమ్యూనిస్టులు దాడిచేసి, పోలీసుల శక్తి చాలక పారిపోయిరి. తునికిపాడు, పరిసరములలో ఒక బస్సునాపి, ఇద్దరు ప్రయాణీకుల నెత్తుకొనిపోయి, అందులో ఒకనిని చంపిరని తెలియుచున్నది. ఈ మధ్య పోలీస్ స్పెషల్ డిప్యూటీ సూపరింటెండెంట్ పళనియప్పన్ మైలవరం దగ్గరనున్న కోడూరులో కొన్ని తుపాకులను, తుపాకి మందు,గుండ్లను పట్టుకొనెను. తిరిగి మొన్న 25న మైలవరంసబ్‌ఇన్‌స్పెక్టర్ కోడూరులో 5 తుపాకులను, వాటి సామగ్రిని పట్టుకొనెను. గత నవంబర్, డిశంబర్ మాసములలో కూడ కమ్యూనిస్టులు ఇట్లే ఈ ప్రాంతములో విజృంభించిరి.

సరిహద్దు ప్రాంతములలో ఉత్తర ప్రాంతపు పోలీసు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ రాజరత్నం, జిల్లా సూపరింటెండెంట్ సి. జె. పి పింటో, స్పెషల్ డిప్యూటీ సూపరింటెండెంట్ పళనియప్పన్, ప్రత్యేకశ్రద్ధతో పనిచేయుచున్నారు.

ఈ కమ్యూనిస్టుల చర్యలను సహించలేని కొందరు కమ్యూనిస్టుపార్టీ సభ్యులు పార్టీనుంచి బయటపడి ప్రత్యేక కూటముగా ఏర్పడ ప్రయత్నించు చున్నట్లు తెలియుచున్నది. (స్వ. వి.)

# బీబీనగర్ కేసువిచారణ

## ప్రాసిక్యూషన్‌సాక్ష్యంఅబద్ధమని ముద్దాయిల ప్రకటన

హైదరాబాద్, నవంబర్ 30: బీబీనగర్ కేసు విచారిస్తున్న ప్రత్యేక న్యాయవిచారణ సంఘం వారు నిన్న సమావేశమై వచ్చారు, ప్రాసిక్యూషన్ సాక్షులు యిచ్చిన సాక్ష్యమంతా అభూత కల్పన అనీ, అసత్యమనీ సయ్యద్ కాశింరజ్వీ చెప్పెను. విచారణ సంఘాధ్యక్షులు నీవేమైన చెప్పెదవా అని అడుగగా రజ్వీ పై విధంగా చెప్పెను. పోలీసు చర్యకు పూర్వం తాను ప్రముఖ వ్యక్తిగా నున్నాననని చెప్పినదంతా తనకు నేర్చు పేరు ఆపాదించటానికేనని రజ్వీ అనెను. హైదరాబాద్ పై ఇండియా తీసుకొన్న చర్యను సమర్థించటానికే యిదంతా చెప్పబడిందనెను. సంఘ అధ్యక్షులు సంస్థాన నిమ్నజాతి సమాఖ్య అధ్యక్షుడు జె. హెచ్. సుబ్బయ్య సాక్ష్యము ప్రస్తావించి దాని సంగతేమిటని అడుగగా అతడుకూడ 'దానికి సంబంధించిన' వ్యక్తేనని రజ్వీ చెప్పెను. అయితే తాను మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసిల్మీన్‌కు, రజాకార్ సంఘానికి అధ్యక్షుడుగా నున్నానని చెప్పెను.

రెండవ ముద్దాయిఅయిన ఖాసిర్ అలీని కూడ విచారణసంఘంవారు ప్రశ్నలు వేశారు. ప్రాసిక్యూషన్ సాక్షులు తనమీద చెప్పినదంతా అబద్ధమని యితడు చెప్పెను. తానెప్పుడూ బీబీనగర్ గ్రామంలోనే లేదనీ, అసలుదాడిలో తానులేననీ చెప్పెను. ముద్దాయిలను త్రిప్పు ప్రదర్శన, అంతకుముందు సాక్షులకు తనను చూపించిన తర్వాత, జరిగిందనెను. యీ ప్రదర్శన నిర్వహణ పూర్తిగా అక్రమాలతో కూడుకొని యున్నదనెను.

ఈ సందర్భంలో కోర్టుముగిసి, విచారణ తిరిగి గురువారంనాటికి వాయిదా వేయబడింది.

# ఆంధ్రవిద్యార్థి కాంగ్రెసుచే ఆటల పోటీఏర్పాటు

విజయవాడ, డిశంబరు 1: 1950 ఫిబ్రవరి మాసములో, బొంబాయిలో జరుగనున్న అఖిలభారత ఆటల (ఒలింపియడ్) పోటీలలో పాల్గొను ఆంధ్ర విద్యార్థులను–ఇతరులను – ఎన్నుకొనుటకై, ఆంధ్ర విద్యార్థి కాంగ్రెసువారు జనవరి 3 తేదీనుండి ఆటల పోటీలను పెట్టనున్నట్లు ఆంధ్రవిద్యార్థి కాంగ్రెసు అధ్యక్షుడు సుంకర సత్యనారాయణ తెలియజేయుచున్నారు. ఈ పోటీలలో నెగ్గినవారిని, అఖిలభారత ఒలింపియడ్‌కు పంపుదురు.

# రైల్వేబోర్డు స్వరూపము అధికారములు

## భారతశాసనసభలో ప్రశ్నోత్తరములు

న్యూఢిల్లీ, నవంబరు 30: రైల్వేబోర్డు అంగ నిర్మాణమునుగూర్చియు, అధికారములను గూర్చియు నేడు భారత శాసనసభలో శ్రీ ఆర్. కె. సిధ్వాగారు ఒకప్రశ్న వేసిరి. రైల్వేశాఖ సభ్యుడు శ్రీ ఎన్. గోపాలస్వామి అయ్యంగారు ప్రశ్నకు సమాధాన మొసగుచు యిట్లుచెప్పిరి. "కేంద్రమునుండి రైల్వేల కార్యకలాపములను, విధానమును కంట్రోలు చేయు సంస్థ స్వరూపస్వభావములు, అంగనిర్మాణము ప్రభుత్వ పరిశీలనలో నున్నవి. ఈ పరిశీలనలో సంతృప్తికరముగా రైల్వే బోర్డు అంగనిర్మాణములోను, అధికారములలోను యేమైనా మార్పు అవసరమేమో ప్రభుత్వమువారు విచారించెదరు. ముఖ్యమయిన అన్ని విషయములలోను రైల్వేబోర్డు ప్రభుత్వము వారి నుండి ఉత్తరువులు పుచ్చుకొనుచున్నది. ఇంతేగాదు, ముఖ్యవిషయములు చర్చకు వచ్చినప్పుడు రైల్వేబోర్డువారు అవసరమును బట్టి కొంతమంది సభ్యులను కలిసికొనుచున్నారు."

శ్రీ తిరుమలరావు గారి ప్రశ్నకు సమాధాన మొసంగుచు రైల్వేబోర్డు సభ్యులను ప్రభుత్వోద్యోగులుగా పరిగణించెదరు వాగ్దాన మొసంగబడియుండలేదని ఈ వాగ్దానమును గౌరవింపవలసియున్నదని శ్రీ అయ్యంగారు చెప్పిరి.

సవరణ చట్టమును ప్రతిపాదించి రైల్వేబోర్డును పునర్నిర్మించెదరా లేక ప్రభుత్వశాఖద్వారా దానిని పునర్నిర్మించెదరా యని శ్రీ టి. టి. కృష్ణమాచారిగారడిగిరి.

అయ్యంగారు సమాధాన మొసంగుచు ఈ దేశములో రైల్వేలను కలిపివేయు స్కీములో నంతర్భాగముగా ఈ విషయము విచారింప బడుచున్నదని, అవసరమైన యెడల శాసనము గావింపబడునని చెప్పిరి. కార్యనిర్వాహకవర్గమువారే చర్చ గైకొనే యెడల సభవారిని ఆలోచించియే చర్యగైకొందురనిరి.

శ్రీ అరుణచంద్రగుహ:— రైల్వేబోర్డు స్వాతంత్ర్యము ననుభవించు చున్నదా? అది, మంత్రివర్గముతో సంబంధము లేని స్వతంత్ర సంస్థయా?

అయ్యంగారు:— ప్రభుత్వము వారు న్యాయశాస్త్ర రీత్యా ఏవిషయములలో రైల్వేబోర్డుకు అధికారము లొసంగిరో ఆ విషయములలో రైల్వే బోర్డు అధికారములు చలాయించుచున్నది. ఏ విషయములలో ప్రభుత్వము వారు అధికారములొసంగిరో ఆ విషయములలో రైల్వేబోర్డు ఉత్తరువులు గావించవచ్చును. ఇదియే వారి స్వాతంత్ర్యము.

పండిత కుంజ్రూ: రైల్వేబోర్డు ప్రభుత్వముతో సంబంధము లేని స్వతంత్ర సంస్థయను భావము పూర్తిగా నిరాధారమేనా?

అయ్యంగారు: నిరాధారమనియే చెప్పవలెను. రైల్వేబోర్డుపరము గావింపబడిన అధికారములకు లోబడు [illegible] యములలో గూడ ప్రభుత్వము [illegible] బోర్డుకు ఉత్తరువులు [illegible] అటంకమూలేదు.

[illegible] సమన్వయము చేయు అధికారములు రైల్వేబోర్డుకు లేనందున్న లేకపోవుటచేత వివిధ రైల్వేలు వివిధ మార్గములను నవలంబించుచు సరిగా పనిచేయకున్న మాట వాస్తవమేనా?

అయ్యంగారు: రైల్వేలలో సమన్వయ భావము లేకపోవుటకు సభ్యుడు తెలిపిన కారణములు సరియైనవి కావు."

# 40,065 ఎకరాల సహకార సాగుబడి

న్యూఢిల్లీ నవంబర్ 30: 'భారతదేశంలో 1948-49లో సహకార స్వపరిపాయ విధానం క్రింద సాగైనభూమి 40065 ఎకరాలు. ఢిల్లీ, పాటియాలా,తూర్పుపంజాబ్ సంస్థాన సమాఖ్యలోనూ, తిరువాన్‌కూర్ కొచిన్ సమాఖ్యలోనూ సాగవుతున్న సహకార క్షేత్రాల విస్తీర్ణం చేర్చలేదు. వాటిసంఖ్యలు ఇంకా లభించలేదు. అని వ్యవసాయమంత్రి జయరామ్‌దాస్ దౌలత్‌రామ్ ఈవేళ పార్లమెంటులో ప్రకటించారు.

# క్రొత్త ప్రాజెక్టులు

న్యూఢిల్లీ, నవంబర్ 30: ప్రస్తుతం అమలు జరుగుతున్న సామాన్య విధానంవల్ల వ్యవసాయికోభివృద్ధి ప్రాజెక్టుల నిర్మాణంలో తప్పనిసరిగా కొంత జాప్యం జరుగవలసివుంటుంది. దామోదర్, బక్రా, హిరాకుడ్ ప్రాజెక్టుల విషయంలో కూడా కొంత జాప్యం జరుగుతున్నది.

'ఏ ప్రాజెక్టు ముందు ప్రారంభించాలి అనేవిషయం ఎప్పుడనగా చూచుకొంది యిప్పుడు ఆలోచించి చెప్పలేము. ఇందుకు గాను ఇంజనీర్ల సమావేశం నుంచి ఇప్పుడు ఏర్పాటు చేసే ఉద్దేశంలేదు' అని సత్యనారాయణ సిన్హా గారు ఈ వేళ పార్లమెంటులో ప్రకటించారు.

# ఆంధ్రరాష్ట్ర విభజన సమస్య

## శ్రీయుతులు సాంబమూర్తి, శంకరశాస్త్రిగార్ల ప్రసంగాలు

రాజమహేంద్రవరం, నవంబరు 30: తుపాను భీభత్సము, ఆంధ్రరాష్ట్ర విభజన సమస్యలపై స్థానిక యువజన కాంగ్రెస్ వారి ఆధ్వర్యమున నిన్న సాయంత్రం సుబ్రహ్మణ్య మైదానంలో బహిరంగ సభ జరిగింది. తూర్పు గోదావరి జిల్లా యువజన కాంగ్రెస్ అధ్యక్షులు ముట్నూరి సోమసుందరంగారు సభ కధ్యక్షత వహించిరి. పై విషయములపై కల్లూరి, టి. శంకరశాస్త్రిగారు ప్రసంగించిన పిమ్మట చెలుకువాడ నరసింహం పంతులుగారు ఉపన్యసించుచూ యీ కాలంలో ప్రతి విషయంలోను అన్యాయం, అక్రమం జరుగుచున్నదనీ ఆఖరుకు తుపాను వంటి ఘోర ప్రళయాన్నిగూడ కొందరు అన్యాయ ప్రవర్తన కవకాశంగా తీసికొనుచున్నారనీ చెప్పి కాంగ్రెస్ సంఘాల వంటి ప్రజాసంస్థలిట్టి విషయాలలో ఎక్కువ శ్రద్ధవహించి ప్రజా సామాన్యమునకు న్యాయం జరుగునట్లు చూడవలెనని హెచ్చరించిరి. తుపానువల్ల అందరకూ కాస్తోకూస్తో నష్టం సంభవించిన మాట నిజమే అయినా లక్షాధికారి ఎక్కువ నష్టంవచ్చినా తట్టుకోగలడు కనుక అట్టివారికి పరిహారమీయ నవసరంలేదనీ, ఏమీ ఆధారం లేకుండా ఎక్కువ నష్టానికి గురియైనవారికి వెంటనే సహాయం చేయడం అత్యవసరమనీ గూడా నరసింహంగారనిరి. క్రొవ్విడి లింగరాజుగారు మాట్లాడిన తర్వాత బులుసు సాంబమూర్తిగారు ప్రసంగించుచూ తుపానువల్ల ఆంధ్రజాతిపొందిన నష్టం అపారమనీ, ఒక్క తూర్పు గోదావరి జిల్లాలోనే సుమారు 1500 చెరువుల గట్లు తెగిపోయినవనీ తెల్పిరి. ఆంధ్రరాష్ట్రముగురించి మాట్లాడుచూ ఆంధ్ర ప్రజానీకం సమర్థతతో వ్యవహరించనియెడల స్వరాష్ట్రం సిద్ధించదనీ, ఒకవేళ సిద్ధించినా వ్యవహారాలు సక్రమంగా సాగవనిఅనిరి. భాషా రాష్ట్రాలు ప్రస్తుతం ఏర్పరిస్తే దేశంలో శాంతిభద్రతలకు భంగం కలుగుతుందని నెహ్రూ భావించుచున్నాడనీ, యిది చాల పొరపాటు అభిప్రాయమనీ, భాషా రాష్ట్రాల నిర్మాణంవల్ల దేశానికి ఎక్కువ బలం చేకూరుతుందని తాను విశ్వసించుచున్నాననీగూడ సాంబమూర్తిగారు చెప్పిరి.

జె. వి. పి. రిపోర్టును ఆంధ్రులంగీకరిస్తే జనవరి 26 లోగా రాష్ట్రవిభజన జరుగునని అగ్రనాయకులు చెప్పిరి. మదరాసు ప్రత్యేకరాష్ట్రంగా చేసేపద్ధతిపై మనమూ రిపోర్టును అంగీకరించాము. అయినా జనవరి 26 లోగా రాష్ట్రవిభజన జరుగబోదనే సంశయాలప్పుడే బయలేరినవి. జనవరి 26 నాటికి రాష్ట్రం సిద్ధిస్తే సరేసరి. దానిని పునాదిగా తీసికొని విశాలాంధ్రస్థాపనకోసం మనం కృషిచేద్దాం. లేకపోయినా మనం అధైర్యపడనక్కరలేదు. ప్రజాబలంవల్ల రాష్ట్రవిభజన దానంతటఅదే జరుగును; అనిగూడ సాంబమూర్తిగారు తమప్రసంగములో హెచ్చరించిరి. సోమసుందరంగారి వందనములతో సభ ముగిసెను. (స్వ. వి)

# ఆంధ్రరాష్ట్రానికి ఒంగోలు రాజధానిగా ఉండాలి

## పట్టణపౌరుల తీర్మానం

ఒంగోలు, నవంబరు 30: "ఆంధ్ర రాష్ట్రములో ఒంగోలుపట్టణము వహించియున్న కేంద్రస్థానమునుబట్టియు, చారిత్రాత్మకప్రాముఖ్యత, ఇతరసౌకర్యముల బట్టియూ, నూతన ఆంధ్రరాష్ట్రమునకు యీ పట్టణమును రాజధానిగా ఏర్పాటు చేయుటకు అన్నివిధముల తగియున్నందున, తగుచర్యలు గైకొని ఈ పట్టణమును రాష్ట్రరాజధానిగా చేయవలెను." అని ఈ రోజు దుంపా పోలిరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన పౌరసభలో ఏకగ్రీవంగా తీర్మానించిరి. శ్రీ పెద్దభోట్ల రామచంద్రరావుగారు పట్టణకాంగ్రెసు (అధ్యక్షులు) తీర్మానమును ప్రతిపాదించగా, భీమరాజు నరసింహారావుగారు బలపరచిరి.

తీర్మానము కేంద్రప్రభుత్వమునకు, మదరాసు ప్రభుత్వమునకు, రాష్ట్రపతికి, ఆంధ్రకాంగ్రెసు సంఘమువారికి పంపుచూ తగుచర్యలు గైకొనుటకు అధ్యక్షునకు అధికారమొసంగుటకు నిర్ణయించారు. (స్వ. వి.)

## మద్రాసు ఆటవికశాస్త్ర కళాశాల

కోయంబత్తూరు, నవంబర్ 30: మద్రాసు ఆటవిక శాస్త్ర కళాశాలలో వచ్చే సంవత్సరం నుంచీ, ఉద్యోగుల శిక్షణ తరగతులను రద్దు చేయటానికి ప్రభుత్వం నిర్ణయించింది.

# కృష్ణా జిల్లాలో అక్రమ సారాయి

## కొత్త రహస్య విధానములు బట్టబయలు

విజయవాడ, డిశంబరు 1: హైదరాబాదు సంస్థానము నుంచి, కృష్ణా జిల్లా సరిహద్దులలోనికి సారాయి యథేచ్ఛగా దిగుమతి, యగుచున్నట్లు తెలియుచున్నది. ఈ అక్రమ దిగుమతికి అనేక వింత విధానములవలంబింపబడు చున్నట్లు, ఈ మధ్య పట్టుపడిన కేసులు బుజావు చేయుచున్నవి. సైకిల్ ట్యూబులను, కుండలను, సారాయితో నింపి పంపుట ఒక పద్ధతి. నడుము చుట్టూ సారాయితో నింపిన రబ్బరు ట్యూబులను కట్టుకొని కొందరు వ్యాపారము సాగించుచున్నారు. వేడినీరుపోసే ఒంటికి కాపుగాయు రబ్బరు సంచులలో సారాయి నింపి తెచ్చుట మరీ నూత్నపద్ధతి. కొందరు ప్రయాణీకుల పెట్టెలు కూడా సారాయి సీసాలతో నిండియుండుట సామాన్యముగా జరుగుచున్నది. అదిగాక, రహస్యముగా సారాయిని ఉత్పత్తి చేయుట చాలా చోట్ల జోరుగా సాగుచున్నది.

ఈ మధ్య మద్యనిషేధపు పోలీసులు, రబ్బర్ ట్యూబుల్లో మూడు గాలన్ల సారాయిని తెచ్చుకొనుచున్న ఒక ప్రయాణీకుని అరెస్ట్ చేసిరి. కుండలలో అడుగున సారాయిని పోసి, పైభాగములో ఏవేవో వరుకులను ఉంచుకొని, పోవువారనేకులీ మధ్య పట్టుబడిరి. రైల్వే పోలీసులీ మాసములో ఒక ప్రయాణీకుని పెట్టెను తెరచి సారాయి సీసాలను పట్టుకొనిరి. వేడినీటి (రబ్బరు) సీసాలు కూడా ఈ మధ్య సారాయితో నిండినవి పట్టుబడినవి.

ఎంత రహస్యముగా చేసినను, కొందరు పట్టుబడుచునే యుండుటవలన, ఈఅక్రమ వృత్తికి గుంభన మరింతగా పెరుగుచున్నది.

# రాష్ట్ర కాంగ్రెసు క్రమశిక్షణా చర్యా సంఘము

విజయవాడ, డిశంబరు 1: ఈమధ్య జరిగిన వివిధ సంస్థల ఎన్నికలలో, కాంగ్రెసు క్రమశిక్షణ నిబంధనలకు వ్యతిరేకముగా ప్రవర్తించిన కాంగ్రెసు సభ్యుల చర్యలను విచారించుటకై రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గము నియమించిన ప్రత్యేక సంఘమువారు డిశంబర్ 21 నుంచి 31 తేదీవరకు తూర్పు గోదావరి జిల్లానుంచి పర్యటనను ప్రారంభింతురు.

ఈ సంఘసభ్యులు గౌతు లచ్చన్న, కందుల ఓబులరెడ్డి, గొట్టుముక్కల రామచంద్రరాజు, ఈడ్పుగంటి శివమూర్తి, ఎ. రంగనాయకులు. (సమాచారకర్త)

# నర్సారావుపేట కాలేజికమిటీ సమావేశము

నర్సారావుపేట, నవంబరు 30: ఇక్కడ కాలేజీ నిర్మించుటకు స్థానిక వర్తకప్రముఖులలో నొకరగు తాడేపల్లి వెంకటనారాయణగారు రు 50000/-(యాభై వేలు) విరాళము నొసగుటచే కాలేజికి శ్రీ సుబ్బారాయ నారాయణ కాలేజి అని పేరు పెట్టుటకు కాలేజీ కమిటీవారు సమావేశమై నిర్ణయించారు. విరాళము నొసంగిన శ్రీ వెంకటనారాయణగారికి వందనములు తెలుపుతూ తీర్మానం చేశారు. (స్వ. వి)

# గురజాడ స్మారకసభ

అలమూరు, నవంబరు 30: గురజాడ అప్పారావుగారి స్మారకవినోత్సవ సమావేశం 'గోష్ఠి' మైదానంలో తరుణసాహితీసమితివారిచే జరపబడెను. మహాసభకు అధ్యక్షతవహించిన తల్లా ప్రగడ సుబ్బారావుగారు గురజాడచేసిన సాహితీ కృషిని విపులంగా వివరించారు.

తరువాత ఉప్పెర్ల లక్ష్మీనారాయణ చౌదరిగారు (రామచంద్రపురం తాలూకా కాంగ్రెసు కార్యదర్శి) అప్పారావుగారి జీవిత విశేషాలను విపులీకరిస్తూ గురజాడ అప్పారావుగారు తెచ్చిన మార్పులు ఒక్క సారస్వతరంగంలో మాత్రమే కాక సాంఘికంగా ఆయనచేసిన సంస్కరణలు గమనించవగ్గవనీ ఏనాడో ఆయన కుల మత విద్వేషాలను తీవ్రంగా ఖండించి చక్కటి సంస్కార మార్గాన్ని చూపించారనీ అన్నారు.

పి. ఎస్. ఏ. దీక్షితులుగారు ప్రసంగించిన అనంతరం, సత్యనారాయణగారు వందనములు సమర్పించుటతో సభముగిసింది.

# చేతి నాణెపు మారకపు దొంగల అరెస్టు

నందిగామ, నవంబరు 30: మొన్న ఇద్దరు మధినుండికొండపల్లివచ్చి ఆరాత్రి నాటకం చూసి తెల్లవారి ఉదయం గ్రిడ్వేస్టేషను లోని ఒక కిల్లీషాపులో చేతితో తయారు చేయబడిన ఒక అర్ధరూపాయీని మార్చగా దుకాణదారు నాణెమును గుర్తించి ఒక పోలీసు ఉద్యోగికి చెప్పెను. అతను వారిరువురను పట్టుకొని సొదావుద్దతన్న 140 చిల్లర అర్ధరూపాయీలు, పావలాల నాణెముల పొట్లమును స్వాధీనంచేసుకొని వారిరువురను అరెస్టుచేశారు. వీరు 27 వ తేదీనుంచి చలామణీచేయుచున్న నాణెములన్నియూ అవి ఏయని తెలియుచ్చింది.

# తాత్కాలిక రాజధాని ప్రసక్తి కూడదు

## విశాలాంధ్ర మహాసభోద్దేశ్యములపై శ్రీ నారాయణమూర్తి ప్రకటన

విజయవాడ, నవంబరు 30: విశాలాంధ్ర మహాసభ ఉపాధ్యక్షులు న్యాయపతి నారాయణమూర్తి ఇట్లు తెల్పుచున్నారు. ఈ విశాలాంధ్రోద్యమ స్థాపన, ప్రభుత్వమును చిక్కుల పెట్టుటకు తలపెట్టినదికాదు. వివిధప్రాంతములలోని ఆంధ్రులందరిలోను సాంస్కృతి కైక్యతను పెంపొందించుటే ఉద్యమాశయము. చెల్లాచెదురుగా పడిపోయియున్న ఆంధ్రప్రాంతములన్నింటిని ఏకముచేయు ప్రయత్నములో ఎవ్వరునూ అడ్డుపడరాదు. రాష్ట్రమునకు ప్రస్తుతములో చెన్నపురమే రాజధాని నగరముగా నుండక తప్పదు. మరెచటనో తాత్కాలికముగా రాజధానినగరము నేర్పాటు చేయ రాబోవు విభజన సంఘము పూనుకొనదనియే తలంచుచున్నాను. ఆంధ్రనేతలు, ఆంధ్రులు ఈ సహేతుక అభిప్రాయములను ద్వేషరహితముగా ఆలోచించి, ప్రవర్తించెదరనియే విశ్వసించుచున్నాను.

# 30 లక్షల టన్నుల ధాన్యం దిగుమతి

## గత పదిమాసాల లెక్కలు

న్యూఢిల్లీ, నవంబరు 30: ఈ సంవత్సరం అక్టోబరు అంతమువరకు దాదాపు 30 లక్షల టన్నుల ఆహారధాన్యములు దిగుమతి చేసికొనబడినవని భారత శాసనసభలో ప్రశ్నోత్తర సమయమున ఆహారశాఖ మంత్రి తెలిపెను. 7,49,000 టన్నుల బియ్యము, 17,76,900 టన్నుల గోధుమలు 1,88,200 టన్నుల బార్లీ 1,33,900 ట. జొన్నలు వరకు 28,48,000 టన్నులు విదేశములనుండి దిగుమతి చేసికొనబడినవని ఆయన చెప్పెను. ఈ సంవత్సరముకంటె 1950 సం॥ములో దిగుమతులు తక్కువగా నుండునని ఆయన చెప్పెను. ఈ ధాన్యములకు యిచ్చిన ధరను తెలుపమంత్రి నిరాకరించెను.

# ఒంగోలులో బియ్యం కొరత

ఒంగోలు, నవంబర్ 30: ఇక్కడ 4, 5 రోజులనుండి బియ్యం సరఫరాకాక ప్రజలు నానాబాధలు పడుచున్నారు. యితరత్రా మానిక 1-8-0 వంతున కొని జీవించవలసిన పరిస్థితి ఏర్పడ్డది. రేషనింగు పోయినా, నిబంధనలు పోనందువల్లనూ పట్టణంలో కావలసిన సరుకు ప్రభుత్వంవారు సరఫరా చేయలేకున్నందువల్లను, ప్రజలు బ్లాకుమార్కెట్టుపై ఆధారపడవలసినస్థితి ఏర్పడ్డది. రవాణాలపై నిషేధములను సడలించిన పరిస్థితి చక్కబడగలదని ప్రజలు భావిస్తున్నారు.

ఇక్కడ చక్కెర అసలు లేనేలేదు. అతి కష్టంమీద రహస్యంగా వీ. 1 కి 4-8-0 లకు లభ్యపడుచున్నదట. ఇతర దిన అవసర వస్తువులు, మిరపకాయలు, చింతపండు, బెల్లం విపరీతంగా పెరిగిపోయినవి. మధ్యరకంవారు, బీదప్రజలు నానాబాధలు పడుచున్నారు. కంట్రోళ్ళ వల్లనే యీ పరిస్థితి వచ్చిందని ప్రజలు అనుకుంటున్నారు. (స్వ. వి)

# వెంకటగిరిలో

వెంకటగిరి, డిసెంబరు 1: ఈ పట్నం రేషనుదుకాణాలు గత మూడురోజులనుండి మూసివేయబడి యున్నవి. పట్టణ ఆహారపరిస్థితి ఆందోళనకరంగా ఉండి ప్రజలు కల్లోల పడుతున్నారు.

# విజయనగరంలో పంచదార కరువు

విజయనగరం, నవంబరు 30: ప్రభుత్వం పంచదార రేషను అమలు పరుస్తామని ప్రకటించిన మరుక్షణంనుంచీ యిక్కడ మార్కెట్లలో సరుకు అదృశ్యమయింది. ఇప్పటివరకూ రేషను అమలుకాని, ధరలను కంట్రోలు చేయుటగాని జరుగలేదు. దొంగమార్కెటులో పంచదార ధర రూ. 5/-వరకూ పెరిగింది. ప్రభుత్వం వీక్షణంలో చవక డిపోలను పెట్టి పంచదార రేషను అమలు పరుస్తుందా అని సామాన్య పౌరులు ఎదురుచూస్తున్నారు.

# చిత్తూరుజిల్లా ఆహార సంఘ సమావేశము

చిత్తూరు, నవంబరు 30: ఈ జిల్లా ఆహారకమిటీ సమావేశము నిన్న జిల్లా కలెక్టరు యస్. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతక్రింద, జరిగినది. సమావేశమునకు శాసనసభ్యులు అధికారవర్గమువారు, అనధికారవర్గసభ్యులు హాజరైరి. జిల్లాలోని చిన్న కాలువలు, చెఱువులు వగైరా మరమ్మతులనుగురించిన రిపోర్టును కలెక్టరుగారు చదివిరి. అందులో కొన్ని కొన్ని చెఱువులు కాలువలను మరమ్మతుచేయించుటకు నిర్ణయంజరిగింది. సమావేశమునకు మాజీమంత్రి గురుపాదంగారు కూడా వచ్చియుండిరి. (స్వ. వి.)

# తుపానుబాధితులకు సహాయం

## క్రిస్టియన్ కాంగ్రెసు వస్త్రదానం

విజయవాడ, డిశంబరు 1: మద్రాసులోని ఆంధ్రరాష్ట్ర క్రిస్టియన్ కాంగ్రెసు వారు, ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కమిటీకి, తుపాను బాధితులకు పంచుటకై, పాత వస్త్రములను పంపిరి. ఈ వస్త్రములను క్రిస్టియన్, క్రిస్టియనేతర బీదలలో పంచుటకై హృదయపూర్వకముగా పంపుచుంటిమని, క్రిస్టియన్ కాంగ్రెసు సభ్యుడు, మద్రాసు కార్పొరేషనులో శానిటరీ ఇన్స్పెక్టరు అయిన కె. బెంజమిన్‌గారు, రాష్ట్రకాంగ్రెసుకు వ్రాసిరి. స్వ. వి.

# విజయవాడలో వరద తుపాను బాధితులకు సహాయము

విజయవాడ, నవంబరు 30: విజయవాడ వరద-తుపాను బాధితుల సహాయ సంఘమువారు ఇంతవరకు 750 చేనేత చీరలను, బాధితులకు పంచి ఇచ్చారు: ఇదే సంఘపు ఆధ్వర్యమున బాధితుల సహాయార్థం డిసెంబరు 10 రాత్రి జవహర్ టాకీస్‌హాల్‌లో 'విప్రనారాయణ' నాటక ప్రదర్శనం ఏర్పాటు చేయబడినది.

# గుంటూరు డివిజన్ తుపాను రిలీఫ్‌కమిటీ సమావేశం

మంగళగిరి, నవంబరు 28: గుంటూరు డివిజను వరద తుపాను రిలీఫ్ కమిటీ మీటింగు నిన్న సాయంత్రము స్థానిక డిప్యూటీ తహశిల్‌దారుగారి ఆఫీసులో అన్నె సంజీవయ్యగారి అధ్యక్షతను జరిగెను. సమావేశమునకు మేడూరి నాగేశ్వరావు యం. యల్. ఏ., డి. రమాకాంతరావు, అన్నె సూర్యనారాయణ, ప్రగడ బాలనాను, పోసాని ప్రకాశరావుగార్లు గుంటూరు డిప్యూటీ కలెక్టరు డి. రామచంద్రరావునాయుడు. పత్తిపల్లి తాలూకా తహశిల్‌దారు యం. జయానందం, గుంటూరు తాలూకా తహశిల్‌దారు, బి. వెంకటస్వామినాయుడుగార్లు స్థానిక డిప్యూటీ తహశిల్‌దారు వి. సీతారామయ్యగార్లు హాజరయినారు. డి. రామచంద్రరావుగారు యిప్పటివరకు వరద తుపాను బాధితులకు జరిగిన సహాయమునుగూర్చి విపులముగా చెప్పారు. వరదబాధితుల కమిటీ సభ్యులు చేసిన సహాయమునకు అభినందనములు తెలియజేయుచూ తీర్మానించిరి.

# ప్రొద్దుటూరు ఫిర్కా రైతు మహాసభ

ప్రొద్దుటూరు, నవంబరు 28: ఈ తాలూకా తాళ్ళమాపురం గ్రామంలో మొన్న సాయంకాలం వి. వీరబ్రహ్మంగారి అధ్యక్షతను ఫిర్కా రైతుమహాసభ జరిగింది. ఫిర్కానుంచి 2 వేలమంది రైతులు యీ సభకు హాజరయ్యారు. ధాన్య సేకరణవల్ల రైతులుకలిగే యిబ్బందులు విపులంగా వెంకట్రామయ్యగారు చెప్పారు. పంట అభివృద్ధి అగుటకు, ప్రభుత్వం అధికాహారోత్పత్తి దిగ్విజయంగా కొనసాగుటకు వ్యవసాయానికి కావలసిన పనిముట్లు ఎరువులు సరసమైనధరలకు ప్రభుత్వం రైతులకు యివ్వాలిఅని అన్నారు.

అధ్యక్షులు ఫిర్కా అభివృద్ధిగురించి మాట్లాడుచూ యిందుకు ప్రజల సహాయ సహకారాలు ముఖ్యమని అన్నారు

# మధ్య యూరప్‌నుంచి రష్యా ఉపసంహరణ?

లండన్, డిసెంబర్ 1: సిద్ధాంతరూపంలో పశ్చిమరాజ్యాలను పెద్దదెబ్బ కొట్టటానికి మాస్కో పెద్దఎత్తున సన్నాహపడుతున్నట్లు తెలుస్తున్నది. రష్యామీద దండెత్తడానికి అమెరికా సహాయం చేస్తున్నదనీ, కాని రష్యామాత్రం శాంతికే పాకులాడుతున్నదనీ ప్రపంచానికి చూపి తద్వారా కమ్యూనిజానికి బలాన్ని సంపాదించుకోవాలని రష్యా ప్రయత్నించబోతున్నది.

రష్యా ఈవిధంగా ప్రయత్నించటానికి పూనుకున్న దనటానికి ఆధారంగా బ్రిటిషు కమ్యూనిస్టు పత్రిక 'డెయిలీ వర్కర్' కామిన్‌ఫార్మ్ సమావేశాన్ని గురించిన వ్యాసంలో, శాంతిని సాధించటమే ప్రపంచంలోని కమ్యూనిస్టుపార్టీల, కార్మిక సంఘాల ప్రధానాశయమని వ్రాసిన అంశాన్ని ఉదహరించవచ్చును.

శాంతిప్రచారం చాల ఉధృతంగా ఉండి, ప్రాముఖ్యతను సంపాదించుచున్న తరుణంలో-1950 సం॥ మొదట్లో-సోవియట్ సేనలు పశ్చిమ జర్మనీనీ, ఇతర మధ్య యూరప్ దేశాలనూ వదలివెళ్ళిపోగలవని కొందరు పరిశీలకులు అంటున్నారు. అవి వళ్ళేముందు తమకు అనుకూల ప్రభుత్వాలను ఏర్పరుస్తవనీ, ఈ సైనిక ఉపసంహరణను కమ్యూనిస్టులంతా సోవియట్ శాంతి ప్రయత్నమని అంటారనీ వారు చెప్పుతున్నారు.

కాని రష్యా ఆవిధంగా తన సేనలను ఉపసంహరించుకుంటే పశ్చిమరాజ్యాలు కూడా ఆక్రమిత ప్రాంతాలనుంచి తమ సేనల్ని ఉపసంహరించుకోవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును. (గ్లోబ్.)



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.